# శాస్త్రీయ హేతువాద సామ్యవాది
# వివేకానందుడు



మూలం

**డా॥ దత్తప్రసాద్ దభోల్కర్**

స్వేచ్ఛానుసరణ

**గౌరవ్**


ప్రచురణ

**సమాజవాద అధ్యయన వేదిక**

**(సెంటర్ ఫర్ సోషలిస్ట్ స్టడీస్)**

**ఆంధ్రప్రదేశ్ - తెలంగాణ**

# శాస్త్రీయ హేతువాద సామ్యవాది వివేకానంద

(Rationalist, Scientific, Socialist Vivekananda)


మరాఠి మూలం : డా॥ దత్తప్రసాద్ దభోల్కర్

ఆంగ్ల అనువాద సాయం : అల్కా పవన్ గాడ్కర్

తెలుగు : గౌరవ్

ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం ఆధ్వర్యంలో

సమాజ మిత్రుల సంఘం సారధ్యంలో

ప్రతిపాదిత చందా : రూ. 10/-

ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com

లోకాయత్ సంస్థ కార్యకలాపాలకు :

website : www.lokayat.org.in

e-mail : lokayat.india@gmail.com

Facebook : www.facebook.com/lokayat.india

Mailing list : Lokayat.pune@lists.riseup.net

contact Phone : Alka Joshi : 9422319129

Adv. Santosh Mhaske : 9822250065

# అంకితం



సత్యం కోసం జరిగే అన్వేషణ సమాజహితం కొరకు రగిలే ఆచరణతో మిళితమయ్యే ఉంటుందనీ రుజువుచేసి, ఆడంబరాలకతీతంగా సాధారణ సంచార సాధు సన్యాసిగా జీవించి, ఉన్నత విద్యను అభ్యసించి కూడా వ్యవస్థలో ఉన్న చెడును ధైర్యంగా ప్రశ్నించడానికి ముందుకొచ్చి, ప్రకృతి వనరుల్ని అద్వితీయ పర్వత సానువుల్నీ, అక్రమంగా దోచుకుంటున్న కార్పొరేట్ జలగలకి వ్యతిరేకంగా 115 రోజుల ఆమరణ నిరాహార దీక్షను చేపట్టి 2011లో ప్రాణాలను విడిచి మొత్తం ఉత్తరాఖండ్ రాష్ట్రంలో మైనింగ్ జరగకుండా ప్రభుత్వాన్ని మెడలు వంచి ఉత్తర్వులిచ్చేలా చేసిన శివానంద శిష్యుడు స్వామి నిగమానంద సరస్వతికి విభేదాలకతీతంగా సహానుభూతిగా....

# అనువాదకుడి మాట

మిత్రులు రావెల సోమయ్య, అరుణ దంపతుల ప్రోద్బలంతో అక్టోబర్ 21–22, 2016న ముంబయిలో జరిగిన సమాజవాద సమావేశాలకు వెళ్ళినపుడు 'లోకాయత్' ప్రచురించిన ఈ బుక్‌లెట్‌ని తీసుకోవడం, వెనువెంటనే తెలుగుచేసి ఇలా అందించడం జరుగుతోంది. వివేకానందుడిపై నా వ్యక్తిగత అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా ప్రస్తుతమున్న ప్రమాదకర పరిస్థితుల్లో ఈ పుస్తకాన్ని తెలుగులోకి తేవడం చాలా అవసరమనిపించింది. విద్వేషం నలుచెరుగులా విస్తృతంగా వ్యాపిస్తున్న వేళ, విశాలమయిన మానవీయ భావజాలాన్ని విభేదాలకతీతంగా ప్రాచుర్యంలోకి తీసుకురావడం బుద్ధిజీవుల మౌలిక బాధ్యతనే విషయాన్ని గుర్తించినవాడిగా ఈ పని చేయాల్సొచ్చింది. కొద్దోగొప్పో ఆదాయమున్నవారు సైతం వీలైనంత ఎక్కువగా ఆదా చేయడమే ఆశయంగా పెట్టుకున్న ఈ రోజుల్లో, ఆశయాలే కాని ఆదాయం లేని వ్యక్తుల్ని సమాజంతోపాటూ ఉద్యమాలు కూడా చులకనగా చూసే పరిస్థితి తెలిసినవాడ్ని కాన ప్రచురణ విషయంలో వెనక్కి లాగినప్పటికీ ఎప్పటిలాగే అంతరంగమే గెలిచి ఇదిలా మీ చేతికొచ్చింది. మొహ్మద్ అఖ్లక్, రోహిత్ వేముల మొదలుకొని మొన్ననే ఎన్‌కౌంటర్లో రాజ్యహింసకి దారుణంగా బలైపోయిన 34 మంది మావోయిస్టుల వరకు అందర్నీ సగౌరవంగా స్మరిస్తూనే ఎన్నాళ్ళగానో తన త్యాగంతో జ్ఞాపకాల్లో నన్ను వెంటాడుతూ వచ్చిన స్వామి నిగమానంద సరస్వతికి ఇలా ఈ కృతిని అంకితమివ్వడం అప్రస్తుతమని నేననుకోకపోగా ప్రస్తుతం అత్యంత అవసరమని భావిస్తున్నాను. గంగా ప్రక్షాళన కోసం 6 సంవత్సరాలు దీక్ష చేసి 2014లో వారణాసిలో మరణించిన బాబా నాగ్‌నాథ్ యోగేశ్వర్ సహా కొద్దిమంది, భారతీయ భక్తి ఉద్యమంలో భాగమైన నామ్‌దేవ్, తుకారామ్, మీరా, కబీర్, సూర్‌దాస్, జయదేవ్, అక్కమహాదేవి, త్యాగరాజు వంటివారి ఉద్యమ రూపాలేనని నా భావం.

వారి ఆధ్యాత్మికతను అంగీకరించే సంగతలా ఉంచి వారిలోని నిజాయితీని, సమాజం పట్ల కొద్దోగొప్పో వారికి గల సంస్కరణాభిలాషను గౌరవించడం నా వరకు నేను వివాదాస్పదం కాదనే భావిస్తాను. ఇక ఈ అనువాదం విషయానికొస్తే అనార్కిజం, నిహిలిజం, సోషలిజం, కమ్యూనిజం మొదలైన తాత్విక సిద్ధాంతాల పట్ల వివేకానందుడికి అవగాహన ఉంది. అంతేకాదు, అరాజకత్వ ఆధ్యుడిగా అనితరసాధ్య విప్లవకారుడిగా పేరొందిన ప్రిన్స్ క్రోప్టకిన్‌ను వివేకానందుడు పారిస్‌లో కలుసుకొని ఆయనతో సంబంధాలు కొనసాగించినట్లు తెలుస్తోంది. ఏదేమైనా ఆయన వాదం మూఢత్వం కాదనేది స్పష్టం కాన, ఈ తతంగాన్ని తలపెట్టాల్సొచ్చింది. ఆంగ్ల పుస్తకాన్ని ఆధారంగా చేసుకుని తెలుగు చేయడం వలన వివేకానందుడి తెలుగు అనువాదాల్ని యిక చూడలేదు. అలాగే రిఫరెన్సు గ్రంథాలన్నింటినీ యథాతథంగా ఇవ్వడం జరిగింది. సరిచూసుకోవాలనుకునే పాఠకులు కూడా ఆంగ్ల గ్రంథాల్ని చూడాలి. తొందరలో దొర్లిన సమన్వయ లోపాలకూ, వాక్య నిర్మాణ దోషాలకూ పూర్తి బాధ్యత నాదే. దేశంలోనే అత్యుత్తమ యువజన చైతన్య సంస్థగా పేరొందిన 'లోకాయత్' మహారాష్ట్రలోని పూనే కేంద్రంగా అనేక కార్యక్రమాలు చేస్తోంది. వినూత్న విధానాలతో అన్ని రకాల ఉద్యమాలకీ నేతృత్వం వహిస్తోంది. అలాంటి సంస్థ 2015లో ప్రచురించిన ఈ గ్రంథాన్ని తెలుగు చేయడానికి అంగీకరించిన 'లోకాయత్' టీంకి మనస్ఫూర్తిగా ధన్యవాదాలు చెబుతూ శెలవు తీసుకుంటున్నాను.

**– గౌరవ్**

# పరిచయం

ఈ పుస్తక శీర్షిక **"శాస్త్రీయ హేతువాద సామ్యవాది వివేకానంద"** మీకు ఆశ్చర్యంగా అనిపించవచ్చు. హిందూమతోన్మాదుల ప్రచారం వివేకానందుని వాస్తవ ఆలోచనల్ని ప్రజలకి చేరకుండా అడ్డుకుంటోంది. అందుకే ఈ రోజు ఆయన్ని కూడా ఒక 'హిందూత్వవాది' (ఛాందస హిందూ)గా చూడటం జరుగుతోంది. ప్రత్యేకమయిన వ్యక్తిత్వం కల ముఖ్యులకి సంకుచిత భావాలను అంటకట్టడం హిందూత్వవాదులకి అలవాటయిన పాత ఎత్తుగడే. ఛత్రపతి శివాజీ విషయంలో ఇదే పద్ధతిని అవలంభించిన ఈ 'సనాతన సంరక్షకులు' ఇప్పుడు అంబేద్కర్ విషయంలోనూ ఇదే ధోరణిని పాదుకొల్పడానికి ప్రయత్నిస్తున్నారు.

ఈ పుస్తకం డా॥ దత్తప్రసాద్ ధబోల్కర్‌గారి చేత వివేకానందుని నిజమైన భావాల్ని ప్రామాణికంగా అధ్యయనం చేసి రచించబడింది. డా॥ ధబోల్కర్ వివేకానందుడి లేఖలు, రచనలు, ఉపన్యాసాల్ని విస్తృతంగా శోధించారు. ఆ క్రమంలో ఆయన మరాఠీలో 'శోధ్ స్వామివివేకానంద[1]' అనే పుస్తకంతోబాటూ వివిధ ప్రసిద్ధ మరాఠి పత్రికల్లో అనేక వ్యాసాలు కూడా ప్రచురించారు. వాటిల్లో ఆయన వర్ణవ్యవస్థ, స్త్రీ స్వాతంత్ర్యోద్యమం, మతం, హేతువాదం, శాస్త్రీయ దృక్పథం, సోషలిజం మొదలగు అంశాలపై వివేకానందుడి దృష్టి కోణాల్ని వివరణాత్మకంగా చర్చించారు. సమసమాజ నిర్మాణం కోసం వివేకానందుడు పడ్డ తపనని ఆయనందులో చిత్రించారు. అలా మరాఠి పత్రిక 'సాధన'లో డా॥ దభోల్కర్ ప్రచురించిన వ్యాసాల్ని కొద్దిపాటి మార్పులతో సవరించి ప్రచురిస్తోన్న పొత్తమిది.

2014లో కేంద్రంలో భారతీయ జనతాపార్టీ పగ్గాలు స్వీకరించిందో లేదో హిందూత్వవాదులు వారి మతవాద ఎజెండా త్వరితంగా అమలు చేస్తున్నారు. రాజ్యాంగంలో ప్రతిష్టించబడిన ప్రజాస్వామ్య, లౌకిక, సామ్యవాద ఇండియాపై ఇష్టానుసారం దాడిచేసి మనుస్మృతి ఆధారంగా కులవ్యవస్థతో నడిచే సమాజాన్ని పునఃస్థాపించడానికి ప్రయత్నిస్తున్నారు. అందులో భాగంగానే 'ఘర్‌వాపసీ', 'లవ్ జిహాద్' మొదలైన విద్వేషకర నినాదాలతో ప్రచారాలు చేస్తూ మైనారిటీలపై నిస్సిగ్గుగా దాడులు చేస్తున్నారు. పాఠ్యపుస్తకాల్ని మార్చివేసి విద్యని కాషాయీకరించడం, భౌతికవాద దృక్కోణంలో ఆలోచించే చరిత్రకారులపై దాడులు చేయడం, శాస్త్రీయాలోచనల స్థానంలో పుక్కిటి పురాణాల్ని ప్రవేశపెట్టడం, హిందూత్వ భావజాలంతో సంబంధమున్న వ్యక్తుల్నే విశ్వవిద్యాలయాల, విజ్ఞాన పరిశోధనాలయాల, సాంస్కృతిక సంఘాల అధిపతులుగా నియమించడం ద్వారా హిందూత్వ బహిరంగంగానే ప్రభుత్వ యంత్రాంగాన్నంతటినీ తన భావజాల బలానికి వాడుకుంటోంది. ఆర్.ఎస్.ఎస్. నాయకులు బహిరంగంగానే బి.జె.పి. నేతలతో సాగించే స్నేహబాంధవ్యాలు సాక్షాత్తూ ప్రధాని మోడీతో సహా బి.జె.పి. నాయకులంతా ఆర్.ఎస్.ఎస్.ని సమర్థిస్తున్నట్లు అర్థమౌతోంది. కానీ నిజానికి అక్షరాలా ప్రభుత్వమే ఆర్.ఎస్.ఎస్. చేతిలో రిమోట్ కంట్రోలింగ్‌లో నడుపబడుతోందనేది గమనార్హం.

ముఖ్యంగా విద్వేషాన్ని జీర్ణించుకున్న ఈ మూర్ఖులు దేశవ్యాప్తంగా ఫాసిస్టు సంస్కృతిలో భాగమైన అసహనాన్ని పెంపొందిస్తున్నారు. రెండు సంవత్సరాల్లో ముగ్గురు

హేతువాదుల్ని పట్టపగలే హత్య చేసారు; వివిధ మతాల్లోని మూఢనమ్మకాలకి వ్యతిరేకంగా అహింసాయుత ఉద్యమాన్ని నిర్మించిన డా॥ నరేంద్ర దభోల్కర్, శివాజీని ముస్లిమ్ వ్యతిరేక రాజుగా ప్రచారం చేస్తున్న హిందూత్వవాదుల బండారాన్ని బట్టబయలు చేసి ఆయనొక్క లౌకిక, కులమతాల కతీతంగా ప్రజలందరి ఆదరాభిమానాల్నీ చూరగొన్న రాజ్యాధినేతగా నిరూపిస్తూ పుస్తకం రాసిన కామ్రేడ్ గోవింద పన్సారే, అలాగే ప్రముఖ హేతువాద ఆలోచనాపరుడు, కర్నాటకలోని హంపీ విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ కల్బుర్గిల్ని చంపేశారు. ఈ హత్యలన్నీ దాదాపు ఒక్కలాగే జరిగాయి. చార్వాకలోకాయతులు, తుకారాం, సోక్రటీస్ నుండి మహాత్మాగాంధీ వరకూ వారి జీవితాల్ని హేతువాదం కోసం అర్పించినవారే.

ఫాసిస్టు భూతం దేశాన్ని కమ్మేస్తోంది. ఇలాంటి సమయంలో వివేకానందుడి నిజమైన ఆలోచనల్ని, ఆదర్శాల్నీ ప్రజానీకంలోకి తీసుకువెళ్లాల్సిన అవసరముంది. సంఘ్‌పరివార్ తయారుచేసి ప్రజలకి చూపుతున్నట్లు వివేకానందుడు సాంప్రదాయ హిందూ సన్యాసి కాడు. **"మనం కులాన్ని నిర్మూలించడానికి గట్టిగా ప్రయత్నించాలి. పురాణాల కంటే హేతువాద ఆలోచనా ధోరణినే నమ్మాలి. కానీ అటువంటి ప్రగతి వ్యక్తిగత స్వేచ్ఛా, స్త్రీ స్వాతంత్ర్యాలతోనే సాధ్యమవుతుంది"** అని విస్పష్టంగా చెప్పిన వివేకానందుడు శాస్త్రీయ దృక్పథం, భౌతికవాద దృష్టి కలిగిన ఆధునిక సన్యాసి. ఆయన సమగ్రమయిన లౌకికవాది. **"రెండు గొప్ప సంప్రదాయాలు కలిసిన మహోన్నత స్థలి మన మాతృభూమి. హిందూయిజం, ఇస్లాం రెండూ ఇమిడాయిందులో. ఈ భూమికి వేదాలు మెదడయితే, ఇస్లాం శరీరం. నా అంతరంగంలో అలాంటి సంపూర్ణమయిన భారతావనినే నేను కలగంటాను"**[2] అన్నాడు. అంతేకాదు, గోశాలలకంటే ప్రజల జీవన ప్రమాణాల్ని పట్టించుకోమన్నాడు. ఇతర సన్యాసుల్లా తన మోక్షం కోసం సర్వశక్తుడైన దేవుడ్ని దేబిరించకుండా హిందూ, ముస్లిం, క్రిస్టియన్ మతాలేవైనా తరతరాలుగా నిర్భాగ్యులుగా అణిచివేయబడ్డ పేదవారి విముక్తి మార్గం కోసం శోధించాలన్నాడు. వారి ఉన్నతి కోసమే తన జీవితాన్ని అంకితం చేసాడు: **"మళ్ళీ మళ్ళీ నేను జన్మించినా, వేలాది వేదనల్ని అనుభవించినా నేను నమ్మిన, అందరి హృదయాల్ని ఐక్యంచేసిన దేవుడ్నే విశ్వసిస్తాను. ఆ దేవుడు అన్ని జాతుల, అందరు జీవుల్లోని బీదలు, నిర్భాగ్యుల్నే పట్టించుకుంటాడు.[3]"** దేశ ప్రజల్ని బ్రాహ్మణ పురోహితవర్గం దోచుకుంటున్న విధానాన్ని దుయ్యబడుతూ **"ఈ భూమ్మీద ఏ మతం కూడా హైందవంలా బీదల గొంతుల్ని తొక్కి నిలవలేదం[4]"**టాడు. క్రైస్తవంలోకీ, ఇస్లాంలోకీ జరుగుతున్న మతమార్పిడులు బలవంతంగా కాక కులాధిపత్యం కారణంగా జరుగుతున్నాయంటాడు. నిమ్నవర్గాల ఉన్నతికి రిజర్వేషన్లు అవసరమని సమర్థించినవాడాయన. 1896లో వివేకానంద తాను సోషలిస్టునని ప్రకటించుకున్నాడు.

తీవ్రతరమౌతోన్న ఫాసిస్టు సంస్కృతిని సమర్థవంతంగా ఎదుర్కోవడానికి వివేకానందుడి విశిష్టమయిన వ్యక్తిత్వాన్నీ, వాస్తవదృష్టికోణాల్నీ, శాస్త్రీయ హేతువాద సోషలిస్టు సన్యాసిగా ఆయననుసరించిన ఆధునిక దృక్పథాన్నీ వెలుగులోకి తీసుకురావడం అవసరం. ఆ లక్ష్యంతోనే ఈ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాం.

# శాస్త్రీయ హేతువాద సామ్యవాది వివేకానందుడు

ఆగష్టు 20, 1893 అమెరికా మెట్‌కాఫ్‌లో ఓ గ్రామం. ప్రముఖ రచయితా, మసాచ్యుయేట్స్‌లోని స్మిత్‌కాలేజీ ఆంగ్ల సాహిత్యధ్యాపకుడూ ఐన కేటే నేన్‌బోర్ని ఫామ్‌హౌస్‌లో వివేకానందుడు కాలం గడుపుతున్నాడు. ప్రపంచ సర్వమతాల సమ్మేళనానికి ఆహ్వానం లేకుండా వచ్చినందుకు జనాలాయన్ని ఆటపట్టిస్తున్నారు. కాని, ఎలాగైనా బాధలుపడి ఆహ్వానాన్ని సంపాదించేందుకు మార్గం కోసం అన్వేషిస్తున్నాడాయిన. ఆరోజు మతాలకి సంబంధించిన ఏ ధార్మిక విషయమూ ఆయన మనసును తాకలేదు. తన శిష్యులకి రాసిన ఉత్తరం వేరే విషయాల్ని ప్రస్తావించింది. అందులో ఆయన *"అడుగంటిపోయిన అతి బీద భారతదేశాన్ని"* ఎవరికైతే *"ఎదగడానికీ, తప్పించుకోడానికీ మార్గాలు లేవో", "శతాబ్దాల అణిచివేత ఫలితంగా భారతీయ సమాజం పేదరికాన్నీ, అధఃపతనాన్నీ, అవమానాలతో కూడిన అనేక దుఃఖాల్నీ ఎలా నింపుకుందో"* ఆయన చెబుతూ ఈ సమస్యల్ని పరిష్కరించే *"రహస్యాన్ని కనుగొన్నానంటాడు" "శతాబ్దాల దీనత్వపర్వతాన్ని"* బద్దలు కొట్టేందుకై యత్నిస్తూ *"ఇది ఒక్క రోజులో అయ్యే పనికాదు. ఈ మార్గమంతా మృత్యువు పొంచివుండే ముళ్ళతో నిండి ఉంది.... ఐనా మనం పురోగమిస్తాం[5]"* అన్నాడు.

వివేకానందుడు ఇంత బలంగా నొక్కి చెప్పడానికి కారణముంది. ఆయన 1890లో తన 27 సం॥రాల వయసులో బారానగర్ మఠాన్ని వొదిలి సంచార సన్యాసిగా మారిపోయాడు. మే 1893 అంటే సుమారు 3 సం॥రాల పాటు కలకత్తా నుంచీ అమెరికా వెళ్ళేంతవరకూ ఆయన భారతావనిని ఈ చివర నుండి ఆ చివరదాకా మొత్తం తిరిగాడు. దేశం అంతా అడ్డంగా, నిలువుగా అడుగడుగూ సంచరించాడు. దేశ పరిస్థితి ఆయన్ని కలతపర్చింది. ఆ కాలంలో తన మిత్రులకీ, శిష్యులకీ ఆయన రాసిన అసంఖ్యాక లేఖల నిండా దేశంలోని దీనులు, పేదల పరిస్థితుల్ని గట్టెక్కించడం కోసం మార్గాల్ని అన్వేషించాల్సిన అవసరం గురించీ, భ్రష్ట సమాజాన్ని బాగుపరచాల్సిన విధానాల గురించీ ఆయన పడ్డ ఆతృత కన్పిస్తుంది.

అనేక విధాల ఆలోచించిన తర్వాత రాసిన లేఖల్లో పేదరికం, అజ్ఞానం, మూఢ విశ్వాసాలు మొదలగు అంధత్వం నుంచీ 20 కోట్లమంది హిందూ ముస్లిమ్ క్రైస్తవ సోదరీసోదరుల్నీ, పిల్లల్నీ విముక్తి చేసే మార్గం హేతువాద విజ్ఞానంపై నిర్మితమయిన సమతాసాధనతోనే సాధ్యమని ఆయన కనుగొన్నాడు.

### శాస్త్రీయ హేతువాదిగా వివేకానంద

*వివేకానందుడు నిస్సందేహంగా శాస్త్రీయ సన్యాసి.*

దేన్నైనా గుడ్డిగా నమ్మకండి

*"అద్భుతాలు, మహిమలనే వాట్ని మనం గుర్తించకూడదు... భారద్దేశంలోని వింతల*

*గురించీ విదేశీ పత్రికల్లో వచ్చే వార్తా కథనాలన్నీ హస్తలాఘవంతో కూడిన వంచనవే తప్ప వివేకవంతుల ప్రదర్శనలెంత మాత్రం కావు[6]"* అన్నాడు. మార్చి 8, 1895న ఇచ్చిన తన ఉపన్యాసంలో,

*"మహత్యాలన్నీ సత్యాన్వేషణా పథంలో గొప్ప అడ్డంకులు[7]"* అంటాడు.

నవంబరు 30, 1894న కిడీ (సింగరవేలు మొదలైర్)కి లేఖ రాస్తూ:

*"మహత్తులు దేనినీ నిరూపించవు. పదార్థం చైతన్యాన్ని రుజువు చేయదు. భగవంతుడు, ఆత్మ, వినాశ రాహిత్యం, మహత్యాలకి మధ్య సంబంధమేమిటి? అధిభౌతిక చెత్తతో మీ బుర్ర చెడగొట్టుకోమాకండి, అలాగే ఇతరుల బుర్రల్ని పాడుచెయ్యకండి[8]"* అన్నాడు.

అలాగే జ్యోతిష్యాన్ని తప్పుబడుతూ నిర్ద్వందంగా, *"జ్యోతిష్యం మొదలగు నిగూఢ మర్మాలన్నీ బలహీన మనస్తత్వం తాలూకు చిహ్నాలని మీరు గుర్తించాలి; కాబట్టీ వాటికి సంబంధించిన అంశాలు మన మెదడ్ని ఆక్రమించుకోగానే మంచి వైద్యుడ్ని సంప్రదించి, ఆహారం, విశ్రాంతి తీసుకోవాలి[9]"*

బుద్ధుడ్ని గురించి స్తుతిస్తూ చెబుతూ వివేకానందుడు మహత్తులన్నింటినీ ప్రచారం చేసే వారంతా మోసకారులనీ వారి పబ్బం గడపడం కోసం వీటినాశ్రయిస్తారనీ అంటాడు.

*"నక్షత్రాల గమనాన్ని గణించడం తదితర అబద్ధపు కళలన్నీ మానుకోవాలి.[10]"*

నిదర్శనంగా వివేకానందుడు ఒక కథ చెబుతాడు.

*"జ్యోతిష్యానికి సంబంధించిన పాత కథ ఒకటుంది. ఒకసారొక పేద్ద జ్యోతిష్యుడు రాజువద్దకి వచ్చి నువ్వో ఆరు నెలల్లో మరణిస్తావని చెప్పాడు. ఆ రాజు ఎంత భయపడిపోయాడంటే మృత్యువు మీద భయంతో బెంగవల్ల చనిపోయేలా తయారయ్యాడు. కాని, మంత్రి తెలివైనవాడు, ఈ జ్యోతిష్యులంతా మూర్ఖులని ఎంత చెప్పినా మంత్రి మాటలు రాజు నమ్మలేదు. ఇక ఇలా కాదని మంత్రి జ్యోతిష్యుడ్ని రాజు దగ్గరికి పిలిపించి రాజుగారి చావు గురించి మరొకసారి శాస్త్రాల్ని తిరగేసి చూడమన్నాడు. చూసిన జ్యోతిష్యుడు మళ్లీ అదే పాట పాడాడు. అప్పుడు మంత్రి మరి మీ మరణం ఎప్పుడో చెప్పగలరా అని జ్యోతిష్యుడ్ని అడిగాడు.*

*మూఢ నమ్మకాలున్న మూర్ఖులకంటే మీరంతా నాస్తికులు కావాలనుకుంటాన్నేను. నాస్తికుడి విషయంలో ఆలోచించేందుకుంది. కానీ మూఢత్వం ఒక్కసారి మీబుర్రల్లో దూరిందా... ఇక అది చెడిపోవడమే తరువాయి, ఆ దిగజారుడుతనం మొత్తం జీవితాన్నే ఆక్రమిస్తుంది.*

– వాల్యూం 3, లెక్చర్స్ ఫ్రమ్ కొలంబో టూ ఆల్మోరా ద వర్క్ బిఫోర్ అజ్

*లెక్కలేసిన జ్యోతిష్యుడు కచ్చితంగా మరో పన్నెండు సంవత్సరాలకు గానీ తనకి చావులేదని నొక్కి వక్కాణించాడు. మరుక్షణం మంత్రి తన కరవాలంతో జ్యోతిష్యుడి తలని శరీరం నుంచి వేరుచేసి, రాజుతో చూసారా ఈ అబద్ధాలకోరుని, ఒక్క నిమిషంలో చచ్చాడన్నాడు.[11]"*

అదే విధంగా దెయ్యాలు, అతీతశక్తులు మొదలయిన మూఢనమ్మకాల్ని విడనాడాలని ప్రజలకు పిలుపునిచ్చాడు. ట్రిప్లికేన్ లిటరరీ సొసైటీ, మద్రాస్‌లో ఫిబ్రవరి 9, 1897న ప్రసంగిస్తూ,

*"శతాబ్దాలుగా మనం హత్తుకునున్న వందలాది మూఢ నమ్మకాల్ని వొదిలించు కోవాలి. అతీతశక్తుల కట్టుకథలు అతి బలహీనమయిన మనస్తత్వ ప్రతీకలు. ఇవన్నీ భ్రష్టత్వానికీ, మరణానికీ సూచికలు... చదూకున్న ఆలోచనాపరులు, సమర్థవంతులు సైతం వీటికై కాలాన్ని వృథా చేయడం, మూఢనమ్మకాలని బలపరిచే కారణాల్ని సృష్టించడం మానవతకే తీరని అవమానం[12]"* అంటాడు.

లైట్ ఆఫ్ ఈస్ట్ పత్రికా సంపాదకునికి లేఖ రాస్తూ (1896): *"అతీంద్రియ వాదం ఎప్పుడూ మానవాళిని బలహీనపరిచి చేటు చేస్తుందని నేను గ్రహించాను[13]"* అంటాడు.

ప్రజల్లో వివిధ రకాలయిన మూఢనమ్మకాల్ని వ్యాపింపచేస్తున్న బ్రాహ్మణుల్ని ఉద్దేశించి ఆయన, స్వప్రయోజనాల కోసమే వారు జనాల్ని వెనకబాటుతనంలో ఉంచి తమ పబ్బం గడుపుకొంటూ దోపిడీ చేస్తున్నారంటాడు. ఆగస్టు 22, 1892న హరిదాస్ విహారిదాస్ దేశాయికి లేఖ రాస్తూ,

*"ప్రజలకి వారి మతానికి సంబంధించీ తినడం, తాగడం, స్నానం చేయటం అన్నింట్లోనూ నిర్దిష్టమయిన మూఢ విశ్వాసాలున్నాయి. పాపం, అమాయకులు! మోసపూరిత పురోహితుల, మతాధికారుల మాటలు వింటారు. వేదాలు, హిందూత్వ సారాంశాలే ఇవని తెలివితక్కువ జనాల్ని నమ్మిస్తారు. (ఈ మతాధిపతులు కానీ,*

*"నువ్వు విన్నావని దేనినీ నమ్మొద్దు" అంటాడు మహోన్నత బుద్ధుడు. అలాగే "వారసత్వంగా వచ్చాయి కనుక పవిత్ర గ్రంథాల్ని నమ్మొద్దు; చాలామంది చాలాకాలం నుండీ పాటిస్తున్నారు కాబట్టి దేనిని నమ్మొద్దు; పెద్దలు వెలిబుచ్చారు కాబట్టీ వారి అభిప్రాయం నిజమని నమ్మొద్దు; అలవాటుగా వచ్చాయి కాబట్టీ అనుకున్నవన్నీ నిజాలని నమ్మొద్దు; గురువులు చెప్పారు కాబట్టీ ఏదీ నిజమని నమ్మొద్దు. స్వయంగా ఆలోచించీ, విశ్లేషించీ ఫలితాన్ని కార్యకారణానుభవంతో సరిచూసుకొని అందరి బాగుకి దారితీసేదాన్ని అంగీకరించి, అందుకోసం జీవించు" అన్నాడు.*

*– వాల్యూం-4, లెక్చర్స్ & డిస్కోర్సెస్, ది క్లెయిమ్ ఆఫ్ రెలీజియన్*

*వీరి ముత్తాతలు కానీ గడిచిన 400 తరాలుగా ఒక్క వేదాన్ని కూడా చూడలేదు.) అలా వార్ని వారే నీచపర్చుకుంటారు. కలియుగంలో బ్రాహ్మణుల అవతారమెత్తిన ఈ రాక్షసుల్ని ఆ భగవంతుడు ఆదుకొనుగాక[14]"*

1893లో ఇండియా నుంచీ అమెరికా ఓడలో ప్రయాణిస్తున్నప్పుడు కూడా దేశాభివృద్ధిని అడ్డుకుంటున్న బ్రాహ్మణుల పాత్రపై కోపం ప్రదర్శించాడు. యకోహమా (జపాన్) నుంచీ జూలై 10, 1893న తన శిష్యులకు రాసిన లేఖలో,

> "ప్రగతిని నిరోధిస్తున్న పురోహితుల్ని తరిమికొట్టండి. వాళ్ళెప్పటికీ మారి హృదయాలను విశాలం చేసుకోరు. శతాబ్దాల అణిచివేతా, మూఢత్వం కలగలిసిన సంతతది[15]" అన్నాడు.

1895 సంవత్సరాంతంలో మిత్రుడు రాఖల్ (స్వామి బ్రహ్మానంద)కి బారానగర్ మఠం నించి లేఖ రాస్తూ,

> *"కొద్దిమంది సాధుసన్యాసులు, బ్రాహ్మలు కల్సి ఈ దేశాన్ని నాశనం చేసారు. ఉద్దేశపూర్వకంగా ఉన్నదంతా దోచుకుంటున్న ఈ దుర్మార్గులు మత ప్రబోధకులుగా ఫోజుకొడ్తారు. ప్రజల నుంచీ డబ్బూ, బహుమతులు స్వీకరిస్తూనే 'మమ్మల్ని తాకవద్దంటూ' డాబు చేస్తారు! ఇంతకీ వీళ్ళు చేసే గొప్ప పనులు ఏమిటి? – ఆళ్ళగడ్డ వంకాయిని తాకడం వలన భూమీమీద ప్రళయం రాబోతోందనో, చేతుల్ని డజనుసార్లు మట్టిలో రుద్ది శుభ్రం చేసుకోకపోవడం వల్ల 14 తరాలవరకూ అంతా నరకంలో పడిపోతారనీ, ఇలాటి చిక్కులతో గత 2 వేల సం॥రాలుగా వారు విజ్ఞానశాస్త్రాన్ని వినియోగించుకుంటూనే సగం మంది ప్రజల ఈతిబాధల్ని పట్టించుకోడం మానేశారు. ఎనిమిదేళ్ళ పసిపాపను ముప్పయేళ్ళ వాడికిచ్చి కట్టబెడుతూ ఉత్సవాలు జరిపే తల్లితండ్రులున్న వ్యవస్థలో ఎవరైనా దీన్ని వ్యతిరేకిస్తే, మన మతం పతనమౌతోంద'నే సాకుచెప్పి వాపోతారు. శారీరక, మానసిక పరిపక్వతనేది లేకుండా చిన్నారి పిల్లల్ని తల్లుల్ని చేస్తూ దానికి శాస్త్రీయ కారణం కనిపెట్టే మతం ఎలాంటిదై వుంటుంది? పైగా చాలామంది తమ తప్పుల్ని ముస్లిములపైకి నెట్టివేస్తారు. ఇలాంటి వారినందర్నీ తప్పుపట్టాల్సిందే. గృహసూత్రాల్లో వివాహానికై అమ్మాయి వయసు ఎంతుండాలనుందో చూడండి... అమ్మాయి యుక్త వయసులో యౌవన దశ రాకుండానే పెళ్ళి చేసెయ్యాలట.*

*బోధకులందరిలోనూ నీతీ, ధైర్యమూ కలవాడు బుద్ధుడు. ఆయనంటాడు: ఏ గ్రంథాన్నీ నమ్మకండి, వేదాలన్నీ వొట్టివి. అవి సరైన భావాల్ని అంగీకరిస్తే అప్పుడు గ్రంథ ప్రమాణాల్ని ఆశించొచ్చు.*

*– వాల్యూం 7, ఇన్‌స్పైయిర్డ్ టాక్స్, 10 జూలై 1895*

*గృహసూత్రాలన్నీ అదే ఆదేశిస్తున్నాయి. ఇక అశ్వమేధ యాగంలో ఇంతకంటే ఘోరమైన విషయాలున్నాయి... బ్రాహ్మణాలన్నీ వీట్ని ప్రస్తావించాయి. వ్యాఖ్యానకారులంతా నిజమేనని అంగీకరించారు[16]"* అన్నాడు.

గుడ్డి నమ్మకాల్ని విడనాడి హేతుబద్ధంగా ఆలోచించాలని వివేకానందుడు ప్రజలకి పిలుపిచ్చాడు. 24 మే, 1896 ఇచ్చిన తన ప్రసంగంలో,

*"విశ్వసించేలాగయితే మనకి హేతువెందుకు ఇవ్వబడింది? హేతువిరుద్ధంగా ఆలోచించడం దైవధిక్కారం కాదా? దేవుడిచ్చిన ఉత్కృష్టమయిన వరాన్ని కాదని జీవించే హక్కు మనకేముంది? తానిచ్చిన సౌలభ్యాన్ని వినియోగించుకోని మూఢభక్తుల కంటే హేతుసహితంగా జీవించే ఆలోచనాపరుల్నే దేవుడు మన్నిస్తాడని కచ్చితంగా చెప్పగలను. ఎందుకంటే మూఢభక్తి ఇంద్రియ సుఖానుభవాల్ని చంపి మనుషుల్ని పశువుల స్థాయికి దిగజార్చుతుంది.[17]"*

పవిత్ర గ్రంథాన్ని గుడ్డిగా నమ్మొద్దనీ ఆయన తరచూ తన శ్రోతలకు చెప్పేవాడు. తన ప్రసంగాల్లో ఎక్కువగా,

*"గ్రంథంలో చదివావు కాబట్టీ ఒక విషయం నిజమని నమ్మకు. ఒకరు చెప్పారు కాబట్టి ఒక విషయం నిజమని నమ్మకు. పరంపరలో వస్తున్న వేదాలన్నీ సత్యాలుగా పరిగణించకు. నీకు నువ్వే నిజాన్ని అన్వేషించు. హేతువుతో శోధించు. అదే యదార్థం[18]".*

జూన్ 24, 1895న ఇచ్చిన ప్రసంగంలో

*"గ్రంథాలేవీ అంతిమం కావు. మతపరమైన సత్యాన్ని ఎప్పటికప్పుడు సరిచేసుకోవడమే సహేతుకతకు సాక్ష్యం.[19]"* అంటాడు.

మూఢ నమ్మకాలు, క్రతువులు, కర్మకాండల కార్ఖానాలోంచి విముక్తి కానిదే స్వతంత్ర భారతావనికి భవిష్యత్తు లేదని వక్కాణిస్తూ వివేకానందుడు కొత్త కోణాన్ని ఆవిష్కరిస్తాడు.

*"స్వాతంత్ర్యం ఇవ్వనివారు స్వాతంత్ర్యానికి అర్హులు కారు. ఒకవేళ ఇంగ్లీషు వాళ్ళు అధికారం కనుక ఇచ్చివేస్తే ఆ అధికారం ప్రజలకు దక్కదు సరికదా వార్ని మరింత దిగజార్చుతుంది. బానిసలే, బానిసల్ని చేయడానికి అధికారం కోరుకుంటారు.[20]"*

*వికాసానికి స్వతంత్రం మొదటి నియమం. ఆలోచించడానికీ, మాట్లాడ్డానికీ, నచ్చిన బట్టలేసుకుని నచ్చింది తినడానికీ, నచ్చిన వారితో జీవిస్తూ నచ్చినట్లుండడానికీ, ఇతరులకి హాని చేయనంతవరకూ ప్రతి ఒక్కరికీ స్వతంత్ర ముండాలి.*

*– వాల్యూం 4, రయిటింగ్ ప్రోస్, టు మై బ్రేవ్ బోయ్స్*

వివేకానందుడు సాంస్కృతిక పునరుజ్జీవనానికై పిలుపిచ్చాడు, మార్చి 19, 1894న తన మిత్రుడు షాషి (స్వామి రామకృష్ణానంద)కి లేఖ రాస్తూ,

> "మనం, ఒక దేశంగా ఐక్యతనూ, వ్యక్తిత్వాన్ని కోల్పోయాం. భారద్దేశంలోని అల్లరంతటికీ అదే కారణం. కోల్పోయిన వ్యక్తిత్వాన్ని దేశానికి మళ్ళీ అందించి ప్రజల్ని మేల్కొల్పాలి.[21]"

** స్వామి వివేకానంద శిష్యుడు తన డైరీలో ఈ సంఘటనని నమోదు చేసాడు : గోరక్షణా సంఘానికి చెందిన ఒక ఔత్సాహికుడయిన బోధకుడొకసారి వివేకానందుడ్ని కల్సి మాట్లాడ్డానికి దయచేసాడు. ఆ సంఘ కార్యకలాపాలూ, లక్ష్యాలు, ఉద్దేశాలు, ఆదాయ వనరులు గురించి అడిగిన పిమ్మట వివేకానందుడికీ, గోరక్షక బోధకుడికీ ఆసక్తికరమైన సంభాషణ జరిగింది. వివేకానందుడు: మధ్యభారతంలో భయంకరమయిన క్షామం తాండవిస్తోంది. అక్షరాలా తొమ్మిది లక్షల మంది ఆకలితో కరువు బారినపడి మరణించారని కేంద్ర ప్రభుత్వం ప్రచురించింది. ఈ విషయంలో మీ సంఘం చేపట్టిన సహాయక చర్యలేవైనా ఉన్నాయా? బోధకుడు : ఈ క్షామం జనుల కర్మ, పాపాల ఫలితం. చేసినదానికి అనుభవించక తప్పదు. బోధకుడి మాటలు విన్నంతలోనే వివేకానందుడి మొహం ఎర్రబడి క్రోధంతో రుద్రత్వాన్ని సంతరించుకుంది. అయినా సమన్వయంతో 'మీరు చెబుతున్న కర్మ కారణంగానే మనుషులు చనిపోతే, గోమాతలు కూడా వాటి కర్మానుసారమే ఛస్తున్నాయనుకోవచ్చుకదా?' అన్నాడు. తత్తరపడిన బోధకుడు, 'అవును. మీరన్నది నిజమే. కానీ గోవు మన తల్లని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి' అన్నాడు. అప్పుడు వివేకానందుడు నవ్వుతూ : నిజమే, గోవు మన తల్లే. ఇంత గొప్ప సాఫల్యజీవులకు వేరే ఎవరు జన్మనివ్వగలరు? అన్నాడు... బోధకుడు నమస్కరించి సెలవు తీసుకున్నాడు. వివేకానందుడు మాతో "ఇవేం మాటలు! మనుషులు వారి కర్మానుసారం మరణిస్తారని ఇతగాడంటున్నాడు, అలాగైతే వారికేదైనా చేసి ప్రయోజనం ఏమిటి? దేశం నాశనమవ్వడానికిలాంటి జిత్తులమారి వేషాలు చాలు! ... మనుషులై ఉండి సాటి మనుషుల పట్ల హృదయంలో ఏ విధమయిన భావనాలేనివారు అసలు మనుషులేనా?"*

*+వివేకానందుడు గోమాంసానికి సంబంధించీ తన భావాల్ని మరింత స్పష్టంగా ఫిబ్రవరి 2, 1897న మధురలో ఇచ్చిన ప్రసంగంలో వెలిబుచ్చాడు:*

*"ప్రతీ చిన్న మూఢ నమ్మకం, ప్రతీ చిన్న గ్రామీణ దేవుడూ మన మతవిశ్వాసంలో భాగమేననుకోడానికి మనం అలవాటుపడ్డాం. కానీ ప్రాంతీయమయిన స్థానిక*

---

** వాల్యూం 6, కన్వర్షేసన్స్ & డైలాగ్స్, ఫ్రమ్ డైరీ ఆఫ్ ఏ డిస్పిల్ (శరత్‌చంద్ర చక్రవర్తి) 1, 1897*

అదే లేఖలో ప్రజల ఉన్నతి కోసం కార్యాచరణ ప్రణాళిక సారాంశాన్ని చెబుతూ,

> *"ఒకవేళ కొద్దిమంది నిస్వార్ధపరులైన సన్యాసులు పరులకి మంచి చేయాలనే తలంపుతో గ్రామగ్రామానికీ విద్యని ప్రచారం చేస్తూ, అక్కడి పరిస్థితుల్ని, ఛండాలంగా నున్నవారి స్థితిగతుల్నీ మార్చడానికి కృషి చేస్తూ కెమేరాలు, పటాలు, ఇతర పరికరాలతో మౌఖిక ప్రచారానికి సిద్ధపడితే సమయానికి అది వార్ని బయటకు లాగి మంచి చేయడమవదా? ఇది చేయడానికి మొదట మన కవసరమైనవి రెండు. ఒకటి మానవ వనరులు, రెండు ఆర్ధిక వనరులు. మన గురువుగారి దయవలన ప్రతి ఊర్లోనూ పది, పదిహేనుమందిని కచ్చితంగా నేను చూడగలను. ఇక తర్వాత నిధుల కోసం నేను అన్వేషించాలి. కానీ భారద్దేశ ప్రజలు డబ్బు ఖర్చు చేస్తారని మీరనుకుంటున్నారా!... స్వార్ధం తలకెక్కినవాళ్ళు దేన్నయినా ఖర్చుచేస్తారా? అందుకే కొంత సొమ్ము సంపాదించడానికి నేను అమెరికా వస్తాను. తర్వాత తిరిగొచ్చి నా దేశాన్ని ఉన్నతీకరించడానికై జీవితంలో అంతిమ లక్ష్యంగా మిగిలిపోయిన ఈ నా ఆకాంక్షను నేనున్నన్నాళ్ళు అవలంభిస్తాను."*

*సాంప్రదాయాలు అనేకమయినవీ, పరస్పర విరుద్ధమయినవీ... అజ్ఞానులు ఏమనుకుంటారంటే ఈ స్థానిక క్రతువే మా మతానికి మూలం అని, కానీ అది శుద్ధ తప్పు. సమాజంలోని స్వల్పమైన సాంఘికాచారం మార్చబడినంతలో నీ మతాన్ని కోల్పోవన్న విషయాన్ని నువ్వెప్పుడూ గుర్తుంచుకోవాలి. ఈ సంప్రదాయాలు యిప్పటికే మారిపోయాయని కూడా జ్ఞాపకముంచుకోవాలి. గోమాంసం తినని బ్రాహ్మణుడు, అసలు బ్రాహ్మణుడుగా చూడబడని కాలమొహటి ఈ దేశంలో నడిచింది; మీరది వేదాల్లో చూడొచ్చు, ఒక గొప్ప సన్యాసి కానీ, రాజు కానీ, కులీనుడు కానీ ఇంటికతిథిగా వస్తే ఉన్న వాటిల్లో మంచి గోవు నరకబడేది; అలా వ్యవసాయోత్పత్తి వ్యవస్థలో మంచి గోవును చంపడమంటే జాతిని నిర్మూలించడమేననే స్పృహ కలిగింది. ఫలితంగా ఆ ఆచారం ఆపబడి, దాన్ని వ్యతిరేకించే గొంతులు పెరగడం మొదలయ్యింది. ఒకప్పుడు అస్తిత్వంలోనున్న ఆచార సాంప్రదాయాలు ఇప్పుడు మనకి భయంకరంగా కనబడతాయి. కొంతకాలానంతరం కొత్త ధర్మాలు జనిస్తాయి. పాతవి పోయి నూతన స్మృతులొస్తాయి.... మామూలు మాటల్లో చెప్పాలంటే ప్రతీ అంశంలోనూ ప్రధానమైనవీ, అప్రధానమైనవనే విభజన మనం చేసుకోవాలి. ప్రధానమైనవి శాశ్వతమైనవి, అప్రధానాలు కొంతకాలం వరకూ విలువ కలిగి ఉంటాయి, నిర్దిష్ట కాలం తర్వాత కూడా వాటి స్థానాన్ని ప్రాధామ్యాలు భర్తీ చేయకపోతే అవి ప్రమాదకరంగా మారతాయి."*

---

\+ *వాల్యూం 3, లెక్చర్స్ ఫ్రం కొలంబో టూ ఆల్మోరా, రిప్లైటు ది అడ్రస్ ఆఫ్ వెల్‌కం టూ మధుర.*

## కుల వ్యవస్థ గురించి వివేకానందుడు

తన కాలం కంటే ముందున్నవాడు వివేకానందుడు. స్వాతంత్ర్య పోరాటం నాటి నాయకులు వారి మిశ్రమ భావాలతో కులం గురించి అస్పష్టమయిన అభిప్రాయాల్ని కలిగుండేనాటికే దుర్మార్గమయిన దోపిడీ వ్యవస్థగా వివేకానందుడు బలంగా కులాన్ని గుర్తించాడు. వంశపారంపర్యంగా వర్ణవ్యవస్థ కొనసాగుతూండడాన్ని 'వికారంగా' పరిగణించి దిగువ కులాల్లో విద్యని వ్యాప్తి చేయడానికి ప్రత్యేక ప్రయత్నాలు అవసరమన్నాడు. తిరుగులేని కుల నిర్మూలనను ప్రతిపాదించాడు.

తన యౌవ్వనదశనించీ కులవ్యవస్థలోని దుర్మార్గం వివేకానందుడు గమనిస్తూనే ఉన్నాడు. ఆగస్టు 17, 1889లో ఆయన రెండు పదుల వయస్సులో ఉన్నప్పుడు వారణాశిలో ప్రేమదాస్ మిత్రా అనే సనాతన బ్రాహ్మణునికి లేఖ రాస్తూ,

> *"పూర్వ పద్ధతి దృష్ట్యా ఈ దేశంలో కులం వారసత్వంగా వస్తోందనడానికి నాకెటువంటి సందేహం లేదు. స్పార్టన్ల హెల్లోట్స్ కంటే అమెరికాలోని నీగ్రోల కంటే ఇక్కడ శూద్రులు మరింత అణగదొక్కబడ్డారనడంలో సంశయం లేదు[22]".*

నవంబరు 2, 1893న చికాగో నుండీ తన శిష్యుడు అలాసింగ పెరుమాళ్‌కి లేఖ రాస్తూ,

> *"పురోహితవర్గం సృష్టించిన విధ్వంసాలన్నింటిలోనూ మొత్తంగా కులమనేదొక ఘనీభవించిన సామాజిక వ్యవస్థ. ఇప్పుడది దుర్గంధం వెదజల్లుతూ కంపు కొడుతోంది[23]"* అంటాడు.

డిసెంబర్ 28, 1893న హరిపాద మిత్రాకి లేఖ రాస్తూ,

> *"ఎవరైనా ఈ దేశంలో తక్కువ కులంలో పుడితే అతను నశించినట్లే లెక్క. అతని భవిష్యత్తు మీద ఆశవొదులుకోవాల్సిందే. ఎందుకు? ఎంత భయంకరమైన పీడనిది. భారతావనిలోని కోట్లాదిమంది దీనుల బాధలు, వేదనల గురించి ఎంతమంది నిజంగా విచారిస్తున్నారు? మనం వారిని తాకము. వారి సాన్నిహిత్యాన్ని భరించము! మనమసలు మనుషులమేనా? అనేకమంది అణగారిన దిగువస్థాయి దీనులకోసం ఈ వేలమంది బ్రాహ్మణులు ఏం చేస్తున్నారు? అయితే గియితే "అసింటా, అసింటా, మమ్మల్ని తాకవద్ద"ంటూ పదే పదే పెదాలతో ఉచ్ఛరించడం తప్ప[24]!"*

అలాగే అగ్రకులాల యువత మనసును ఆవహించిన కుల దురహంకారాన్నీ, అంటరానితనాన్నీ వివేకానందుడు చాలా ఘాటుగా విమర్శించి చీవాట్లు పెట్టాడు.

> *"ఇక మీరు, అసలెవరు?.... వందలాది సంవత్సరాల్నుంచీ బూజుపట్టిన మూఢనమ్మకాల్ని బుర్రల్లో నింపుకునీ, అహంకారంతో వ్యర్థప్రసంగాలు చేస్తూ*

*ఉన్న ఉత్సాహాన్నీ, శక్తినీ ఆహారానికి సంబంధించిన అంటుముట్లను తేల్చడానికో, మానవత్వాన్ని చంపే సామాజిక క్రూరత్వాన్ని పాటించడానికో మాత్రమే వెచ్చించే వెగటు బతుకుల్ని వెళ్ళదీస్తున్నవాళ్ళు.... [25]"*

'పుట్టుకతో ప్రతిభావంతులయిన బ్రాహ్మణులపై వివేకానందుడు ధ్వజమెత్తాడు. అలాంటి ప్రతిభ "స్వచ్ఛమైన భ్రమ"న్నాడు. అబ్రాహ్మణుల అభివృద్ధికి తోడ్పడమన్నాడు.

*"మహానుభావుల ప్రస్తావన లేకుండా, దుర్వాసన వెదజల్లే దురహంకారాన్ని ప్రదర్శించకుండా, లేని నైపుణ్యాల్ని మూఢనమ్మకాల్నీ తూర్పు, పాశ్చాత్య దేశాల్లో ప్రచారం చేసుకుంటూ పబ్బం గడుపుకోకుండా [26]"* ఉన్న స్థితిలో ఉండమన్నాడు.

జూలై 4, 1897 ఆల్మోరా నుంచి సిస్టర్ నివేదితకు ఆయనిదే విషయాన్ని రాసాడు. ఆయనందులో బుద్ధుడి కాలం నుంచీ నేటిదాకా బహుశా ఎప్పుడూ లేని విధంగా తన ఆశ్రమంలో మొట్టమొదటిసారి కొంతమంది బ్రాహ్మణ బాలురు కులంతో సంబంధం లేకుండా రోగులకి సపర్యలు చేస్తున్నారంటాడు.[27]

భారద్దేశ భ్రష్టత్వానికీ, బీదరికానికీ బ్రిటీష్ వలస పాలనకంటే ఇక్కడి కులవ్యవస్థే ప్రధాన కారణమంటాడు వివేకానందుడు. ఫిబ్రవరి 1897లో అమెరికా, యూరోపు పర్యటన దిగ్విజయంగా ముగించుకుని ఇండియా వచ్చాక తమిళనాడులోని కుంభకోణంలో బ్రాహ్మణ సనాతనవాదుల అడ్డానుంచే ప్రసంగిస్తూ,

"మిత్రులారా, మీకు కొన్ని కఠినమైన నిజాల్ని చెప్పాలి. మన భ్రష్టత్వానికీ, మనమే కారణం కాని ఆంగ్లేయులు కాదు. కులీన వంశస్తులు ఈ దేశ ప్రజల్ని ఎంతగా పట్టిపీడించారంటే, వారు సామాన్య ప్రజల్ని తమ కాలికింది చెప్పుల్లా ఎంతలా నలిపేశారంటే, దాదాపు పేదలంతా తాము మనుషులమనే విషయాన్ని మర్చిపోయారు. శతాబ్దాలుగా వారు కట్టెలు కొట్టేవారుగా, నీళ్ళు తోడేవారుగా మాత్రమే మిగిలిపోయి చివరికి స్వతహాగా వార్ని వారు బానిసలుగా భావించుకునే స్థాయికి దిగజారారు... అంతేకాదు వార్ని అలాగే ఉంచడానికి అన్ని రకాలయిన క్రూరవాదనలూ, ప్రేతాలోచనలూ వంశపారంపర్యంగా పనికిమాలిన నీతిబాహ్యమైన పశుత్వాన్ని ప్రదర్శించడం జరుగుతోంది.[28]"

*కులాన్నసలు గుర్తించని గొప్ప భారతీయ తత్వవేత్త బుద్ధుడు. అతని అనుచరులెవరూ భారతావనిలో మిగలలేదు. ఇతర తత్వవేత్తలంతా ఎంతోకొంత సామాజిక దురభిమానాల్ని కల్గి ఉన్నారు; వాళ్ళెంతగా ఆకాశాన్ని తాకే మాటలు చెప్పినా, ఏదోమూల రాబందు గుణాన్ని నింపుకునున్నారు.*

*– వాల్యూం 7, ఇన్‌స్పైర్డ్ టాక్స్, జూలై 9, 1895*

ఇంకా ఆయనేం రాస్తాడంటే,

*"ఎప్పుడైతే మ్లేచ్ఛ పదం పుట్టించి సామాజిక సంబంధాల్ని సంకుచితం చేసారో అప్పుడే భారద్దేశ విధి వక్రించింది.[29]"*

జనవరి 24, 1894న తన శిష్యులకి రాసిన లేఖలో కులవ్యవస్థనెలా పతన మొందించాలో చెప్తూ,

*"అతి సామాన్య బీదలకి కూడా భారద్దేశపు లోపలా వెలుపలా వెలువడిన మహోన్నతమయిన భావాల్ని ఉన్నతంగా అందించాలనేదే నా ఆలోచన. వారు వారుగా ఆలోచించే స్థాయికి ఎదగాలన్నదే నా యోచన. స్వతంత్రాలోచనా, స్వేచ్ఛాజనిత కార్యాచరణ మాత్రమే మానవాళి వృద్ధికీ, ఉన్నతికీ దారితీస్తాయి. అది జరగనప్పుడు వ్యక్తి, జాతి, మొత్తంగా దేశమే పతనమౌతుంది. కులంగా – కులాతీతంగా, మతంగా – మతాలకతీతంగా, ఏ వ్యక్తయినా, వర్గమయినా, జాతైనా, దేశమయినా స్వేచ్ఛాలోచనకి సంకెళ్ళు వేసి స్వతంత్రాచరణని అడ్డుకుందంటే ఆ రాక్షసత్వం నశించి తీరాలి.[30]"*

ఏప్రిల్ 9, 1894న అలాసింగాకి రాసిన లేఖలో,

*"ఒకే కులం మిగిలే రోజొకటొస్తుందం[31]"*టాడాయిన. అంతేకాదు. దళితులకి విద్య అందించాల్సిన అవసరాన్ని గ్రహించినవాడాయిన. అందుకే 1895లో రాఖల్‌కి రాసిన లేఖలో,

*"అసమానతనేది ఉన్నప్పుడు బలవంతులకంటే బలహీనులకి అవకాశాలు ఎక్కువ ఇవ్వబడాలి. మరోలా చెప్పాలంటే, బహుజనుడికి అవసరమైనంతలా చదువు బ్రాహ్మణుడికక్కర్లేదు. బ్రాహ్మణుల బిడ్డకి ఒక ఉపాధ్యాయు డవసరమైతే బహుజనుడి పిల్లాడికి పదిమంది అధ్యాపకులు అవసరం.[32]"*

బ్రాహ్మణులు వారి ప్రత్యేక హక్కుల్ని వొదులుకోవడం ద్వారా వెనకబడ్డ కులాలవారి ఉన్నతికి తోడ్పడాలనీ ఆయన విజ్ఞప్తి చేసాడు. అంటే దిగువ కులాలకి 100% రిజర్వేషన్లను ప్రతిపాదించాడు.

"ఓ బ్రాహ్మణులారా...మీ విద్య కోసం డబ్బు ఖర్చుచేయడం మాని దాన్ని ఒక పరయా విద్యకోసం ఉపయోగించండి. అర్హతగల బలహీనులకి బహుమతు లందించండి. వివేకవంతుడైన బ్రాహ్మణుడు తనకి తానే విద్యావంతుడు కాగలడు. అవిద్యావంతులయిన

*అదృష్టం, విధి, కర్మ వంటివేవీ లేవు. అలా మనల్నెవరూ బలవంతం చేయలేరు. మనం చేసేదేదయినా మార్చుకోగలిగేదే.*

*– వాల్యూం 1, లెక్చర్స్ & డిస్కోర్సెస్, సోల్, గాడ్ & రిలీజియన్*

యితర కులస్తుల్ని వివేకవంతులుగా మలచడం వారి విధి... ఇదే సరయిన నేనర్థం చేసుకున్న ధర్మం.[33]"

## మతం గురించి వివేకానందుడు

మతానికి వివేకానందుడు చాలా హృద్యమయిన నిర్వచనాన్ని చెప్పాడు.

> ***"జీవితాన్ని అందరి మంచి కోసం, ఆనందం కోసం అర్పించడమే మతం.[34]"*** అంటాడాయిన.

ఛాందసరహిత హైందవ సన్యాసిగా మతంపై ఆయన భావాలు నేటి హిందూత్వ వాదులకి పూర్తి భిన్నంగా ఉన్నాయి. ప్రజానీకంలో వివేకానందుడికి సంబంధించిన వాస్తవాలు అంతగా తెలీకపోవడంతో హిందూ మతోన్మాదులు ఇతర మతాలపై విద్వేషాన్ని రెచ్చగొట్టడానికి వివేకానందుడ్ని కూడా పావుగా వాడుకుంటున్నారు.

సచ్ఛీలమయిన మతాలన్నీ సమభావనలతో కూడిన సదాచారాలను కలిగి ఉంటాయనేది ఆయన భావం.

> *"ఒక్క మతం యొక్క ప్రమాణం అన్ని మతాలకీ ప్రామాణికమవుతుంది... ఒక మతం కనుక సత్యమైతే, మతాలన్నీ కచ్చితంగా సత్యాలై తీరాలి.[35]"* అంటాడు.

తదనంతరం,

> *"అన్ని మతాల ఆదర్శవంత సారాంశం ఒక్కటే – స్వాతంత్ర్యాన్ని సముపార్జించడం, దుఃఖాన్ని విడనాడటం.[36]"* అంటాడు.

డిసెంబర్ 1966లో యునైటెడ్ నేషన్స్ జనరల్ అసెంబ్లీ అంతర్జాతీయ పౌర, రాజకీయ హక్కులకి సంబంధించిన ఒప్పంద పత్రాన్ని ఆమోదించడం జరిగింది. అందులో 18వ ఆర్టికల్ క్రింది వాట్ని గుర్తిస్తూ,

- ప్రతి ఒక్కరికీ వారికి నచ్చిన, సమ్మతమయిన మతాన్ని అనుసరించే హక్కుంది.
- ప్రతి ఒక్కరికీ తామనుసరించే మతాన్ని ప్రకటించుకోడానికీ, ప్రార్థించుకోడానికీ, పాటించుకోడానికీ తగిన స్వేచ్ఛ ఉంది.
- ఎవరికీ కూడా మతానికి సంబంధించీ బలవంతంగా ఎదుటి వారి స్వేచ్ఛని ఆటంకపరిచే హక్కు లేదు. అని పేర్కొనడం జరిగింది.

ప్రపంచ రాజ్యాలు ఆమోదించిన 70 సం॥రాల పూర్వమే వివేకానందుడు సర్వమతాల సగౌరవం, సమభావన సౌభ్రాతృత్వం గురించి బోధించాడు.

| |
|---|
| *మనకో కొత్త దేవుడు, కొత్త వేదాలు, కొత్త మతం అవసరం.* |

*"విభిన్న మతాల మధ్య సహచర భావన అవసరం. వాటికవి నిలిచినా కాలగర్భంలో కొట్టుకొనిపోయినా, పరస్పర గౌరవం నుండీ పరస్పర సహకారం నుండీ జనించే ఐక్యతా భావన కావాలి.[37]"* అంటాడు.

అంతేకాదు, హిందూ మతవాదులు ధైర్యం చేయలేని అనూహ్యా భావాలయిన వెలిబుచ్చుతూ మొహమ్మద్‌ని "సమతా ప్రవక్త" అంటూ, ఇంకా "మానవాళి సహోదరత్వానికి ప్రవక్త[38]" అంటాడాయిన్ని. జూన్ 10, 1898న మొహమ్మద్ సర్ఫరాజ్ హుస్సేన్‌కి రాసిన లేఖలో,

*"ఏ మతమయినా అభినందించదగిన రీతిలో సమానతకి సమీపంగా వచ్చిందనంటే అది ఇస్లాం, ఒక్క ఇస్లాం మాత్రమే[39]"* నంటాడు.

నవంబర్ 19, 1894న మద్రాస్ శిష్యులకి రాసిన లేఖలో భారతీయ బహుముఖ సంస్కృతులకి సంబంధించిన చైతన్యంతో హిందువులు "భౌతిక నాగరికత", "దర్జీలు కుట్టిన దుస్తులు ధరించడం" ఆరోగ్యకరమయిన ఆహారాన్ని తీసుకోవడం ముస్లిముల నుంచే నేర్చుకున్నారంటాడు[40]. ఈ దేశం అజేయంగా వికసించాలంటే మతాలన్నింటి మధ్యా సహకారవంతమయిన సామరస్య భావన అవసరమని నొక్కి చెబుతాడు. పైనుదహరించిన లేఖలోనే సర్ఫరాజ్ హుస్సేన్‌తో,

*"అనుభవంతో కూడిన ఆచరణాత్మకమయిన ఇస్లామే కనుక లేకపోతే వేదాంత శాస్త్రాలు అవెంత గొప్పవయినా మానవాళి ముందు ఏమాత్రం విలువలేనివిగా మిగిలిపోయేవని బల్లగుద్ది ఒప్పించడానికి నేనెంతమాత్రం వెనుకాడను... మన మాతృభూమి రెండు గొప్ప వ్యవస్థల సంగమ స్థలం. వేదాంతం తనువయితే, ఇస్లామ్ మనసు – ఈ రెండే నా మనోవిశ్వాసం[41]"* అంటాడు.

1890 నుండీ 1893 వరకూ దేశదిమ్మరి సన్యాసిగా దేశమంతా తిరిగినప్పుడు వివేకానందుడు దేశప్రజలు దయనీయంగా అనుభవిస్తున్న జుగుప్సాకరమైన పేదరికాన్ని దగ్గరగా దర్శించడమే కాక, కోట్లాదిమంది వెనుకబాటుతనానికి మత విశ్వాసాలు, మూఢ నమ్మకాలు, బ్రాహ్మణ సన్యాసుల దోపిడీ ఎలా కారణ మౌతున్నాయో ప్రత్యక్షంగా పరిశీలించాడు. అప్పుడే తన మిత్రులకీ, శిష్యులకీ రాసిన అక్షరాల్లో మండుతున్న అగ్నిపర్వతంలా నిప్పులు కక్కాడు.

*"ఒక దేశంలో ఒక పక్క కోట్లాదిమంది బీదాబిక్కీ జనం కేవలం ఇప్పచెట్లపై ఆధారపడి బతుకీడుస్తుండగా మరోపక్క సాధువులు, బ్రాహ్మణులు అంతేమంది పేదల రక్తం తాగుతూ జలగల్లా జీవిస్తున్నారు. ఇది దేశమా? నరకమా? ఇది మతమా? మరణ మృదంగమా[42]?"* అన్నాడు.

హిందూ ముస్లిమ్ మతాల్లోని మతోన్మాద ఛాందసుల్ని గురించి ఆయన ప్రజల్ని హెచ్చరించడమే కాక మతసామరస్యాన్ని చెడగొట్టే దుష్ప్రచారాల పట్ల కూడా జాగ్రత్తగా

ఉండమని వారించాడు. బలవంత మతమార్పిడులకి సంబంధించిన ప్రచారాల్ని కనీసం రెండు లేఖల్లో ఆయన ఖండించాడు. ఈ దేశంలో మతమార్పిడులనేవి ముస్లిములు, క్రైస్తవుల బలంతో జరగలేదు. అవెప్పుడూ అగ్రకులాల దుర్మార్గాల వల్ల, ఆధిపత్యం వల్ల మాత్రమే జరిగాయి, అన్నాడు.

**మొదటి లేఖ :** సెప్టెంబర్ 20, 1892 ఖేత్రిలోని పండిత్ శంకర్‌లాల్‌కి,

> *"ఒక భంగీని భంగీగా చూడడానికి అల్లంత దూరం ప్లేగువ్యాధొచ్చినట్టు పారిపోయే లోకం అదే వ్యక్తి చెంబుడు నీళ్ళు తలపై కుమ్మరించుకుని నచ్చిన మంత్రాలు సణుగుతూ ఒక చొక్కావేసుకుంటే ఎంతటి సదాచార హిందువయినా కుర్చీ చూపించి చేయి కలపకుండా ఉండలేదు. అందుకే పురోహితవర్గంచేత పాలించబడి అణువణువు భూమీ బ్రాహ్మణుల ఆధీనంలో కల ట్రెవెన్‌కోర్‌లో ఇప్పుడు పావుశాతానికి పైగా క్రైస్తవులయిపోయారు...! అందుకు వారిని నేను తప్పుపట్టను...*[43]*"* అంటాడు.

**రెండో లేఖ :** నవంబర్ 1894లో హరిదాస్ విహారీదాస్ దేశాయికి రాస్తూ,

> *"ఇండియాలోని పేదల్లో ముస్లిములే ఎక్కువమంది ఎందుకని ఉన్నారు? వారంతా బలవంతంగా కత్తితో బెదిరించబడి మతం మార్చుకున్నారనడం అర్థంలేనిది. జమీందారీ భూస్వాముల నుండీ, పురోహితులనుంచీ స్వేచ్ఛనొందడానికే వారంతా ముస్లిములయ్యారు. ఫలితంగా బెంగాల్‌లో హిందూలకంటే ముస్లిములే ఎక్కువ మందున్నారు. ఎందుకంటే ఇక్కడ చాలామంది జమీందార్లున్నారు. అట్టడుగుకి మునిగిపోయిన ఈ అభాగ్యుల గురించి ఆలోచించేదెవరు*[44]*?"* అంటాడు.

ఈరోజు ఆర్.ఎస్.ఎస్. దాని అనుబంధ శక్తులూ క్రైస్తవులకీ, ముస్లిములకీ వ్యతిరేకంగా విద్వేషాన్నీ, హింసనూ రెచ్చగొట్టేరీతిలో ప్రమాదకరమయిన ప్రచారాలు చేస్తూ, వార్ని తిరిగి హిందూలుగా మారి 'వెనక్కి' రమ్మంటూ, బెదిరిస్తున్నాయి. అప్పుడిక ఎంచక్కా మెజారిటీ హిందూలకి అణిగిమణిగి ఉంచొచ్చని కలలు కంటున్నాయి. సంఘ్‌పరివార్ భావజాలానికి సరిగ్గా వ్యతిరేకమైనవి వివేకానందుడి బోధనలు. ఆయన బలవంత మతమార్పిడుల్ని ఎంతగా వ్యతిరేకించాడో, 'ఘర్ వాపసి' వంటి కార్యక్రమాల్ని అంతగా నిరసించాడు.

> *"బలవంతంగా బెదిరించబడి మతంలోకి వొచ్చిన వ్యక్తి ఏ మతానికీ చెందడు*[45]*"* అంటాడాయిన.

*విధవరాలి కన్నీళ్ళు తుడవలేని, అనాథ నోట్లో యింత ముద్దపెట్టలేని దేవుడ్నీ, మతాన్నీ నే నమ్మను.*

*– వాల్యూం 5, ఎపిస్టికల్స్ – ఫస్ట్ సిరీస్ XXI, అలాసింగా అక్టోబర్ 27, 1894.*

వివేకానందుడు అన్ని జనసమూహాల నడుమ సఖ్యతనూ, సమగౌరవాన్నీ కోరాడు. అదే సమయంలో మితిమీరిన సహనాన్ని నిరసిస్తూ 'దైవదూషణగా' పరిగణించాడు:

> *"సహనమంటే అర్థం నీది తప్పని తెల్సి జీవించేందుకు నిన్ను నేను అనుమతిస్తున్నానని. అసలు మనం మరొకరికి జీవించేందుకు అనుమతివ్వడం దైవధిక్కారం అవదా[46]?"*

ఇంకా ఆయన,

> *"మన నినాదం పరస్పర సమ్మతేగాని సహనం కాదు... గతకాలపు మతాలన్నింటినీ నేనంగీకరించి, ఆరాధిస్తాను. భగవంతుడ్ని దర్శిస్తాను. ముస్లిముల మసీదుకీ, క్రైస్తవుల చర్చికీ, బౌద్ధుల ఆరామానికీ కూడా నేను శరణుకోరుతూ పోతాను.[47]"*

మతసంబంధ విలువల్ని బలవంతాన రుద్దడాన్ని ఆయన తీవ్రంగా విమర్శించాడు. మైనారిటీ బ్రాహ్మణుల శాఖాహార ఆహారపలవాట్లనే మొత్తం సమాజం మీదా, ముఖ్యంగా ముస్లింల మీదా హింసాత్మకంగా రుద్దాలని మతోన్మాదులు ప్రయత్నిస్తున్న ప్రస్తుత పరిస్థితుల్లో వివేకానందుడి మాటల్ని మరోసారి గుర్తు చేసుకోవడం అవసరం,

> *"మనం ప్రతివ్యక్తికీ తెల్సుకునే, ఎంచుకునే, కావల్సిన దానిని అనుసరించే స్వేచ్ఛనివ్వాలి. ఉదాహరణకి మాంసాహారం ఒకరికి ప్రయోజనకరంగా ఉంటే మరొకరికి ఫలాలు ఉపయోగకరంగా ఉండొచ్చు. ప్రతి ఒక్కరికీ వారి వ్యక్తిగత విశేషాల్ని పాటించే హక్కు ఉంది, అదే సమయంలో ఇతరులకి నచ్చిన దాన్ని విమర్శించే హక్కు లేదు.... అంతా మా దారిలోనే నడుస్తూ మమ్మల్నే అనుసరించాలనడం సరికాదు.... మతం యొక్క తీవ్రమయిన పొరబాటేమిటంటే సామాజిక విషయాల్లో అడ్డంగా తలదూర్చడం... మనక్కావలసింది మతం సాంఘికంగా సంస్కరణగా మారకపోవడం... (కోట్లాది దీనుల స్థితిగతుల మధ్య)*

*మీరొచ్చి ఏదయినా మంచి చేయదల్చుకుంటే, ఆడంబరమైన మీ ఆరాధనోత్సవాల్ని అవతలికి తోసిరాజని బతికున్న దేవుడ్ని పూజించండి – మానుష దేవుడు, మానవ రూపం ధరించినవాడు... వారణాసీ, బృందావనాల్లో గుడి తలుపులు మూసి తెరిచేలోగా కొన్ని లక్షల రూపాయలు ఖర్చు పెట్టబడుతున్నాయి! ఆ దేవుడికో మరుగుదొడ్డీ, సుష్టుగా భోజనం.. మరోవైపు బతికున్న దేవుళ్ళు ఆకలితో అలమటిస్తూ మరణిస్తున్నారు, విద్యలేక కృశిస్తున్నారు! బొంబాయిలోని బనియాలు మనుషులు ఛస్తుంటే పట్టించుకోరు కానీ రక్తం పీల్చే నల్లుల కోసం నింగినంటే ఆస్పత్రులు నిర్మిస్తారు.*

*– వాల్యూం 6, ఎపిస్టిల్స్, సెకండ్ సిరీస్ XLV బ్రదర్ డిసిపిల్స్, 1894*

*ప్రతీ సామాజికాంశంలోనూ వేలుపెట్టాల్సిన పని ఈ పురోహితులకి ఏముందసలు[48]?"*

వివేకానందుడికి హిందూత్వ వాదులతో సామ్యమనేదే లేదు. వివేకానంద శిష్యుడు స్వామి అఖండానంద బెంగాల్‌లో ఒక అనాథాశ్రమం కడుతుండగా ఆయనకి లేఖరాస్తూ,

"అన్ని మతాల వారినీ – హిందూ, ముస్లిం, క్రైస్తవుల్నీ చేర్చుకోం"దన్నాడు వివేకానందుడు.

ఇంకా చేరుస్తూ,

"....కానీ వారి మతాల జోలికి పోవద్దు. మీరు చేయాల్సిందల్లా వారికి వేరు వేరు ఆహార ఏర్పాట్లు మాత్రమే"[49] అంటాడు.

మతోన్మాదానికి వ్యతిరేకంగా వివేకానందుడు బలంగా నిలబడ్డమే కాకుండా, మత కల్లోలాలు, అల్లర్లు, హింసలను రెచ్చగొట్టే ముష్కర మూకల దాడులకు తీవ్రంగా చలించాడు.

*"ఒక మనిషికి అత్యంత శుభాన్ని కలుగజేసేది మతం. అలాగే ఒక మనిషిని భయకంపితుడ్ని చేసేది కూడా మతమే. మతం కంటే ప్రేమనీ, శాంతినీ పంచగలిగేదేదీ లేదు. మతం కంటే పగనీ, ద్వేషాన్నీ పుట్టించేది కూడా లేదు. మానవాళి సౌభ్రాతృత్వాన్నీ, సోదరభావననూ ఒక్కతాటిపైకి తీసుకురాగలది మతం. మనుషులు కోసమే కాక జంతువుల కోసం కూడా ఎన్నో స్వచ్ఛంద సంస్థల్నీ, దాతృత్వ వ్యవస్థల్ని, ఆసుపత్రుల్నీ నిర్మించగలిగేది మతం; అలాగే లెక్కలేనంత విధ్వంసాన్ని సృష్టించి రక్తపుటేరులు పారించగలిగేది కూడా మతమే[50]"* నంటాడు.

హేతుసహిత సంవేదనలు, మేధోజనిత బంధాల సమ్మేలనమే విశ్వమని వివేకానందు డంటాడు. ఇరువైపులా అజ్ఞాత విషయాలున్నాయంటాడు. మనిషి కేవలం తినడం, త్రాగడం తెల్సుకున్న పదార్థం కాడు. మానవావిర్భావం నుంచీ అతడు అవతలివైపు కోసం అన్వేషిస్తూనే ఉన్నాడు. అజ్ఞాతాన్ని అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఇంద్రియాల పరిమితిని దాటి పయనిస్తూనే ఉన్నాడు. మతావిర్భావానికి నిజమయిన కారణమదే; మనిషి స్వభావంలోనే మతమనే భావనుంది[51]. కాబట్టీ, మతం వల్ల పెరిగిన జాడ్యాల్ని మనం కనుక నిర్మూలించదలిస్తే, మతం ద్వారానే నిర్మూలించాలి. అందుకే ముందు ప్రస్తావించిన లేఖలో సర్ఫరాజ్ హుస్సేన్‌ను ఉద్దేశించీ,

*"వేదాలు, బైబిలు, ఖురాన్ లేని చోటికి మానవాళిని నడిపించాలి; వేదాలు, బైబిలు, ఖురాన్లని సమైక్యం కావించడం ద్వారానే అది సాధ్యం[52]"* అంటాడు.

వివేకానందుడు తన లేఖల్లో వ్యక్తం చేసిన తీవ్రమయిన భావాలు మతోన్మాదుల మౌలిక సిద్ధాంతాల్నే సమూలంగా బలహీనపరుస్తాయి. ఆయన బోధనల్ని ముక్కలు చేసి

వారికనుకూలంగా ప్రచారం చేయడం వల్లనే సంఘ్‌పరివార్ వివేకానందుడ్ని కూడా హిందూత్వ చిహ్నంగా చిత్రించగల్గుతోంది. ఉదాహరణకి పురాతన భారతీయ వైభవాన్ని గురించీ ప్రస్తుతమున్న విమానాలు, కార్లు, జన్యుశాస్త్రం గతంలోనే ఉన్నాయనే వాదనలన్నింటినీ ఆయన తిరస్కరించాడు.

"ఓ దేవుడా, ఎల్లప్పుడూ గతంలోనే బతికే నా దేశం ఎప్పుడు విముక్తమవుతుందో[55]? అని దుఃఖించాడు. మరోచోట,

*"ప్రాచీన కాలంలో చాలామంచి విషయాలున్నాయి. అలాగే చెడ్డ విషయాలూ ఉన్నాయి. మంచి విషయాల్ని నిలుపుకోవాలి. కానీ, భావి భారతావని ఎప్పుడూ గతం కంటే గొప్పదేనని గుర్తించాలి[54]"* అంటాడు.

'దేవుడికి విశ్రాంతి సమయం' అనే వ్యాసాన్ని డా॥ శ్రీరామ్‌లాగూ రాసినప్పుడు లేచిన దీర్ఘకాలిక దుమారం సంగతి తెలిసిందే. ఐతే, ఏప్రిల్ 27, 1896లో ఆలంబజార్ మఠంలోని తన సన్యాసి మిత్రులకి రాసిన లేఖలో అవే రకమయిన భావాల్ని వివేకానందుడు వ్యక్త పరచడం గమనార్హం. పురాతన దేవుళ్ళు "మరింత పాతబడిపోయా"[55] రంటూ,

*"మనకిప్పుడొక 'కొత్తదేవుడు, కొత్త మతం, కొత్త వేదాలు కావాలి' ఎందుకనంటే మనమో 'కొత్త భారతావని'ని నిర్మించాలి"* అంటాడు.

భారతదేశపు లౌకికత్వాన్ని మంటకలిపి, రాజ్యాంగాన్ని బలహీనపర్చి దేశాన్ని హిందూ రాజ్యంగా మార్చాలనుకుంటున్న ఆర్.ఎస్.ఎస్. మూకలకి సమూలంగా విరుద్ధమైనవి వివేకానందుడి భావాలు. ఆర్.ఎస్.ఎస్. అనేది ఏర్పడ్డానికి మూడు దశాబ్దాల పూర్వమే, మతోన్మాద జాతీయవాదం జన్మిస్తున్నప్పుడు దూరదృష్టికల స్వామి సెలవిస్తూ,

*"అన్ని శాఖల, పక్షాల, తెగల, మత సంబంధ జాతీయవాద భావాలన్నీ ఆపివేయాలి. ప్రతీ తెగ లేక జాతి తన దేవుడ్ని తన మతాన్నే పాటిస్తూ ఇతరులవి తప్పులుగా భావించడం గతకాలపు మూఢత్వం. అలాంటి ఆలోచనలన్నీ విసర్జించబడాలి"[56]* అంటాడు.

## సోషలిస్టు వివేకానందుడు

1890 నుంచీ 1893 దాకా 3 సం॥రాలు వివేకానందుడు దేశమంతా తిరిగాడు. కాలినడకనా, గుర్రపుబగ్గీలోనూ, రైల్లోనూ... పొగపీల్చే ఊడ్చుడు కార్మికులతోనూ, నికృష్టమైన మురికివాడల మధ్య, మౌంట్ అబూలోని ముస్లిమ్ లాయర్ వద్దా గాయక్‌వాడ్ వీధిలో తిలక్ దగ్గరా, ఖేత్రి మహారాజు అంతఃపుర అతిథిగా అనేక అవతారాలెత్తాడు. ఈ మూడు సంవత్సరాల్లో ఆయన మతగ్రంథాలనేవీ అధ్యయనం చేయలేదు. అందుకు బదులుగా ప్రజల పరిస్థితిని అర్థం చేసుకోడానికి ప్రయత్నించాడు. అప్పుడు తన శిష్యులకీ, మిత్రులకీ రాసిన లేఖల్లో లోతైన తన మనోవేదనని వెలిబుచ్చాడు.

నవంబర్ 19, 1894న న్యూయార్కు నుంచీ తన మద్రాసు శిష్యులకి లేఖ రాస్తూ,

> *"భూమ్మీద తినడానికింత తిండివ్వకుండా స్వర్గంలో శాశ్వత సుఖాలనిచ్చే దేవుడ్ని నేను నమ్మను. ఛీ! భారద్దేశం ఎదగాలి, పేదల కడుపులు నిండాలి, విద్య, విజ్ఞానం వికసించాలి, అలాగే పురోహితులు, జిత్తులమారి మతాధిపతుల దుష్టత్వం తుదముట్టించబడాలి. వంచనతో నిండిన పురోహితవర్గం, ఆధిపత్యంతో కూడిన సాంఘిక నియంతృత్వం నశించాలి! అందరికీ మరింత ఆహారం, మరిన్ని అవకాశాలు రావాలి!"*[57] అన్నాడు.

ప్రజల్ని వృద్ధిలోకి తేవడమంటే వారికి తిండిపెట్టి చదువు చెప్పించడం మాత్రమే కాదు. మనుషులుగా వారి మర్యాదనీ, ఆత్మగౌరవాన్నీ పునఃప్రతిష్టించడం. వివేకానందునికిది తెలుసు. జూన్ 20, 1894న హరిదాస్ విహరీదాస్ దేశాయికి లేఖరాస్తూ,

> *"పూరి గుడిసెల్లో బతికే నిజమయిన నా జాతి ఎన్నడో పౌరుషాన్నీ, వ్యక్తిత్వాన్నీ కోల్పోయింది. హిందూ, ముస్లిమ్, క్రైస్తవుల కాళ్ళకింద కావాల్సినప్పుడల్లా నలిగి నలిగి, జేబులో ఏ కొద్దిమాత్రం డబ్బున్నవారి కాళ్లకింద నలిగిపోడానికైనా మేమర్హులమేననే దశకి ఈ జాతి చేరుకుంది. కోల్పోయిన వ్యక్తిత్వాల్ని వారు తిరిగి పొందాలి.*[58]*"* అంటాడు.

ఘోరమయిన పరిస్థితుల్నుంచీ జనాల్ని బయటకు తెచ్చి వారిలో ఆత్మ గౌరవాన్నీ, వ్యక్తిత్వ వికాసాన్నీ కలిగించడం అంతసులభం కాదు. అలాసింగ పెరుమాళ్‌కి రాసిన లేఖలో ఇదే విషయమై వివేకానందుడు తన అసహనాన్ని కనబరుస్తాడు,

> *"నేను అధిభౌతికవాదినో, తాత్వికుడినో, సన్యాసినో కాదు. నేనో బీదవాడ్ని, బీదవాళ్ళని ప్రేమిస్తాను. పేదలుగా ఎవర్ని పిలుస్తారో, ఈ దేశంలో వార్ని గురించి ఎవరు పట్టించుకుంటారో, ... రెండు మిలియన్లమంది శాశ్వత పేదరికంలో, అజ్ఞానంలోనూ మునిగిపోతున్నారని ఎవరికి తెల్సు? వారి విముక్తికి మార్గమేదీ?"*[59] అంటాడు.

*ప్రజల్ని అశ్రద్ధ చేయడాన్ని మించిన పెద్ద పాపం నా దృష్టిలో వేరేదీ లేదు, అదే మన పతనానికి కారణం. భారద్దేశ ప్రజ విద్యావంతులై, కడుపు నిండితే గానీ రాజకీయాల్లోని ఏ మాత్రమూ వారికి ఉపయోగపడవు. మనం చదూకోడానికి వాళ్ళు చెల్లిస్తున్నారు, మన దేవాలయాలు వాళ్ళు నిర్మిస్తున్నారు, కానీ పర్యవసానంగా దెబ్బలూ, తన్నులూ తింటున్నారు. ఆచరణాత్మకంగా వారంతా మన బానిసలు. ఉత్తమమయిన భారతావనిని ఉద్భవింపచేయాలంటే మనం వారికోసం పనిచేయాలి.*

*– వాల్యూం 5, ఇంటర్వ్యూస్, ది మిషనరీ వర్క్ ఆఫ్ ది ఫస్ట్ హిందూ సన్యాసిన్ టు ది వెస్ట్, ఫిబ్రవరి 1897*

మరో 2 సం॥రాలు లోతుగా ఆలోచించిన మీదట నవంబరు 1, 1896న సన్నిహిత మేరీ హేలేకి రాసిన లేఖలో,[60]

**"నేను సోషలిస్టుని"** అని ప్రకటించాడు.

1896 అంటే వివేకానందుడికి 33 సం॥రాలు. ఇదాయనకి అకస్మాత్తుగా తట్టిన కొట్టిపారేయగల తలంపు కాదు. ఎంతో అనుభవంతో, లోతైన మేధోమథనంతో తీసుకున్న నిర్ణయమది. అంతకుమునుపే ఆయన మూడేళ్ళపాటు దేశమంతా తిరిగి ప్రజల పేదరికం, వెనుకబాటుతనాల్ని దగ్గరగా గమనించాడు. తర్వాత మరో మూడు సం॥రాలు పాశ్చాత్య ప్రపంచంలో పరిభ్రమించి ఆకట్టుకునే అనేక విషయాలతోపాటూ యూరప్, అమెరికాల్లోని స్వతంత్ర ప్రజాస్వామ్యం యొక్క పరిమితుల్ని కూడా జీర్ణించుకున్నాడు.

> *"ఒక దేశం యొక్క అధికారం, సంపద కోట్లాది మంది శ్రమని తెలివిగా దోచుకుంటున్న కొద్దిమంది చేతుల్లోనే ఉంటాయి. ఆ అధికారమదంతో వాళ్ళీ భూమ్మీద రక్తపుటేరుల్ని పారించగలరు. మతం మొదలుకుని అన్నీ వాళ్ళ పాదాలకిందే ఉంటాయి; వాళ్ళే అంతటినీ శాసించే సర్వాధిపతులు. పాశ్చాత్య*

### *స్త్రీ స్వతంత్రం గురించి*

స్వామి రామకృష్ణానందకి రాసిన వో లేఖలో వివేకానందుడు,

*"మహిళల పరిస్థితులు మెరుగుపడనిదే లోక సంక్షేమం సాధ్యం కాదు. ఒక్క రెక్కపై ఆధారపడి ఎగరడం ఏ పక్షికీ సాధ్యం కాదు కదా."*

*"భారద్దేశంలో రెండు అతిపెద్ద దుర్మార్గాలున్నాయి. మహిళల్ని అణిచివేయడం, కుల నిబంధనలతో పేదల్ని పీల్చి పిప్పి చేయడం."*

*– వాల్యూం 6, ఎపిస్టిల్స్ – సెకండ్ సిరీస్, LXXV, 1895*

*అలాగే అమెరికా నుండి తన శిష్యులకి రాసిన లేఖలో అమెరికా అభివృద్ధికీ, ఉన్నతికీ, వికాసానికీ అక్కడి స్త్రీ స్వేచ్ఛే కారణమన్నాడు.*

*"ఎందువల్ల మనం బానిసలుగా, దీనులుగా, శవాల్లా ఉన్నాం? సమాధానం స్పష్టమే... మీరు మీ స్త్రీల పరిస్థితుల్ని చక్కదిద్దగలరా? అప్పుడు మీ వృద్ధికి ఒక నమ్మకముంటుంది. లేకపోతే ఇప్పుడున్నట్లుగానే ఎప్పుడూ మీరు వెనకబడే ఉంటారు."*

*– వాల్యూం 5, ఎపిస్టిల్స్, ఫస్ట్ సిరీస్, VI, 28 డిసెంబర్ 1893*

*పవిత్ర మేరీమాతలో వెయ్యిమందిని మరణించేలోగా ఈ దేశంలో నేను ఆవిర్భవింపజేయగలిగితే, నేనిక ప్రశాంతంగా కన్ను మూస్తాను."*

*– వాల్యూం 6, ఎపిస్టిల్స్ – సెకండ్ సిరీస్, XLVII, 25 సెప్టెంబర్, 1894*

*లోకం మొత్తం కొద్దిమంది జలగల చేతనే పాలించబడుతోంది. రాజ్యాంగ ప్రభుత్వం, పార్లమెంటు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకి సంబంధించి మీకు వినబడేవన్నీ పరిహాసాలే[61]"* అంటాడు.

చాలా సంవత్సరాలుగా సుదీర్ఘంగా ఆలోచించిన మీదట భారతదేశపు బీదరికానికీ, వెనుకబాటుతనానికీ సోషలిజమే ముక్తి మార్గమనే ముగింపుకి వివేకానందుడొచ్చాడు. మేరీ హేలీకి రాసిన లేఖలో సామ్యవాదాన్ని సమర్ధిస్తూ అలాంటి సమాజంలో సమానత్వముంటుందనీ, పేదల భౌతిక స్థితిగతులు మెరుగవుతాయనీ, విద్య ప్రయోజనం విస్తృత ప్రజానీకానికందుబాటులో కొస్తుందనీ చెప్పుకొస్తాడు. అలా తనని తాను సోషలిస్టుగా ప్రకటించుకున్న వివేకానందుడు, సోషలిస్టు వ్యవస్తే పరిపూర్ణమైనదనీ, దోషరహితమైనదనీ వాదించలేదు. పైగా అది "సంస్కృతిని తగ్గిస్తుంద"నీ, బహుశా "అసాధారణ మేధావులు తగ్గుతార[62]"నీ చెప్తూ మరోచోట[63]వ్యక్తిస్వేచ్ఛా స్వతంత్రాలు బలవుతాయంటాడు.*

అయినప్పటికినీ,[64]

*"నేను సామ్యవాదినే కాని అదే పరిపూర్ణమైన వ్యవస్థనుకోవడం లేదు. కానీ ఆకలితో మాడటం కంటే ఒక ముద్ద దొరకడం ఉత్తమం. ఇతర విధానాలన్ని ప్రయత్నించి ఏదోక కొరతుందని గ్రహించాం. ఈ పద్ధతిని పాటించి చూద్దాం.."* అంటాడు.

భవిష్యత్తుని అంచనా వేసిన వివేకానందుడు సోషలిజం ఒక్క భారతదేశంలోనే కాక మొత్తం ప్రపంచమంతా వస్తుందంటాడు, ప్రతీ దేశంలోనూ ఇక్కడ శూద్రులనబడే శ్రామికవర్గ ప్రజలు సామాజిక ఉద్యమాల్ని నిర్మించి నూతన తరహా పరిపాలనను నిజం చేసి తీరుతారనన్నాడు,

*"ప్రతీ దేశంలోనూ శూద్రులు, స్వభావంలోనూ, అలవాట్లలోనూ శూద్రులుగా తప్ప వైశ్యులుగానో, క్షత్రియులుగానో మారకుండా నున్న శూద్రులే సమాజంపై సర్వాధికారాన్నీ పొంది పాలించే కాలమొస్తుంది. పాశ్చాత్య ప్రపంచాన్ని బీటలువార్చే కొత్త వెలుగుల ఉదయపు కాంతి ఇప్పటికే మొదలయ్యింది... సామ్యవాదం,*

---

** 21వ శతాబ్ధారంభంలో జరిగిన లాటిన్ అమెరికా దేశాల్లోని సోషలిస్టు ప్రయోగాలు ఈ భయాన్ని తోసిపుచ్చాయి. ఆయా దేశాలు పేదరికాన్ని, నిరుద్యోగాన్నీ ఎదుర్కోవడమే కాక ప్రజలందరికీ చదువు, ఆరోగ్యం, గృహ వసతి ఉచితంగా లేదా నామమాత్రపు రుసుముతో అందిస్తున్నాయి. ప్రజలు వారి అంతర్గత శక్తుల్నీ, సృజనాత్మకతనీ వికసింపచేసు కునేందుకు అవకాశాలు కల్పించబడ్డాయి. మరీ ముఖ్యంగా ఇవన్నీ ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాల ద్వారా ప్రజాస్వామికంగా జరిగాయి.*

*అరాజకత్వం, శూన్యవాదం యింకా ఏ శాఖయినా సేనానిగా వుంటూ సామాజిక విప్లవాన్ని అనుసరించే దశలే.*[65]"

నిజానికి పాశ్చాత్య దేశాలన్నింటా శక్తివంతమయిన అనేక సోషలిస్టు ఉద్యమాలు చోటుచేసుకుంటున్న 19వ శతాబ్దమది. త్వరలోనే అవి భారతావనిలో కూడా చిగురించగలవనే విశ్వాసం వివేకానందుడికుంది,

> "*దిగువ కులాలవారు... పొద్దస్తమానూ ఒకే రీతిలో యంత్రాల్లా కష్టపడుతుంటే విజ్ఞానంతో వార్ని నిర్దేశించే విద్యావంతులు మాత్రం ఆ కష్టజీవుల ఫలాల్ని మొత్తంగా స్వాహా చేస్తున్నారు. ప్రతి దేశంలోనూ సంగతిదే. కానీ కాలం మారింది. దిగువ కులాలు క్రమంగా ఎదిగి న్యాయంగా వారికి చెందవలసినదానికై ఐక్యమై నిలిచే సమయమొచ్చింది. యూరపు, అమెరికా దేశాల ప్రజలు మొదటగా మేల్కొని ఇప్పటికే పోరాడ్డం ప్రారంభించారు. ఈరోజు అణగారిన కులాల ఆధ్వర్యంలో జరుగుతున్న సమ్మెలు, ఆ వాతావరణం ఈ దేశంలో రాక తప్పదనడానికి సాక్ష్యమిస్తున్నాయి. అగ్రకులాలు ఇక ఎంతో కాలం బహుజనుల్ని అణిచి తొక్కిపెట్టలేరు, కావాలంటే వారు చూడొచ్చు*[66]" అంటాడు.

సమాజాన్ని సోషలిజం దిశగా మళ్ళించడానికి మూఢ నమ్మకాలకూ, అహేతుక భావనలకూ వ్యతిరేకంగా ముందుండి ఉద్యమం నడిపిన వ్యక్తి వివేకానందుడు. దేశం సామ్యవాద లక్ష్యాల్ని సాధించే మార్గాలపై ఆయనకి తనవయిన విలక్షణమయిన సొంతాభిప్రాయాలున్నాయి. సోషలిజాన్ని మతంతో మిళితం చేయాలంటాడాయిన.[67] అదే సమయంలో, ఆ మతం ఏదైతే ఉందో అది రేపటి తర్కానికి నిలిచేదై వుండాలంటాడు; విజ్ఞానశాస్త్ర పరిశోధనకి ఎటువంటి పద్ధతులు ప్రామాణికాలో అవే పద్ధతులు "మత విజ్ఞానానికి[68]" అన్వయించాలంటాడు.

సామ్యవాదులందరిలాగానే వివేకానందుడికి కూడా బహుజన సమూహాలపై సంపూర్ణ విశ్వాసముంది. అగ్రకులాలు కాక కేవలం అణగారిన ప్రజలే వ్యవస్థని మార్చగలరని ఆయన నమ్మకం,

> "*నవ భారతమా మేలుకో... దుక్కిదున్నే రైతుల, మత్స్యకారుల, వీధులూడ్చే, చెప్పులుకుట్టే భారతం ఎదుగుతుంది. వర్తక దుకాణం నుంచీ, వ్యర్థాలమ్మే దుకాణం నుంచీ దాన్ని ఎదగనిద్దాం. ఫ్యాక్టరీల్నుంచీ, సంతల్నుంచీ దాన్ని ఉత్పత్తి చేద్దాం. స్వచ్ఛమయిన తోటల్లోంచి, అరణ్యాలలోంచీ, కొండలు – పర్వతాల్లోంచీ అటువంటి భారతావనిని ఉద్భవింపజేద్దాం*[69]" అంటాడు.

ఆయన ప్రజలపై నమ్మకం ఎందుకు పెట్టుకున్నాడంటే, వారి కష్టాలు వారికి ధైర్యాన్నిచ్చాయి, తిరుగులేని స్థైర్యాన్నిచ్చాయి. సమాజ దిశను మార్చడానికి అవసరమైన శక్తినీ, సహనాన్నీ ఇచ్చాయి.

"వేల సంవత్సరాలుగా సామాన్య ప్రజలు అణిచివేతని అనుభవిస్తున్నారు; ఏ మాత్రం సణక్కుండా ఆధిపత్యాన్ని భరించడం మూలాన వారికి అద్భుతమయిన మనోధైర్యం సిద్ధించింది. సుదీర్ఘమయిన వేదనలు వారికి దేనికీ జంకని, ఎవరికీ లొంగని సజీవత్వాన్ని ప్రసాదించాయి. పిడికెడు అన్నంతో ప్రపంచాన్ని వణికించగల సత్తా వారి సొంతం; అలాంటిది, అర పిడికెడన్నం వారికి పెట్టండి చాలు, వారి శక్తిముందు ప్రపంచమెంతో పెద్దది కాదు; అజేయమైన సజీవత్వాన్ని వారిట్టే సంతరించుకోగలరు.[70]" అంటాడు.

భారతదేశంలోని పేదల, శూద్రుల ఉన్నతి కోసం తపించే సామ్యవాదులందరి లాగానే వివేకానందుడు సైతం సంకుచిత జాతీయవాది కాడు. తానో విశ్వనరుడ్నని ఆయనంటాడు.

> *"నా జీవిత లక్ష్యం నాకు తెలుసు, నా కోసం ఎలాంటి దురభిమానాలు వద్దు; భారతదేశానికి నేనెంత చెందుతానో, మిగతా ప్రపంచానికీ అంతే చెందుతాను, దాని గురించి పిచ్చి ప్రేలాపనలొద్దు"*[71] అంటాడు.

## యువతకి వివేకానందుడి సందేశం

వివేకానందుడు దేశమంతా పర్యటిస్తూ పేదల వికాసానికి జీవితాన్నంకితం చేయండంటూ యువతకి పిలుపిస్తూ, అది సమాజం పట్ల వారి కర్తవ్యమని గుర్తు చేసేవాడు,

> *"స్వర్గ నరకాలు, ఆత్మపునర్జన్మలు ఉన్నాయో లేదో ఎవరిక్కావాలి? ప్రపంచముంది, దాన్నిండా విచారమూ, దీనత్వమూ ఉన్నాయి. అలాంటప్పుడు బుద్ధుడు చేసినట్లుగా వాట్ని తగ్గించడానికి ప్రయత్నించాలి. ఆ ప్రయత్నంలో ప్రాణాలు పోయినా సరే. మీరు ఆస్తికులయినా, నాస్తికులయినా, అజ్ఞాతవాదులయినా, వేదాంత వాదులయినా, క్రైస్తవులయినా, మహ్మదీయు లయినా మిమ్మల్ని మీరు మర్చిపోయి ప్రజల కోసం పాటుపడండి. ఇదే మీరు నేర్చుకోవాల్సిన మొట్టమొదటి పాఠం"*[72] అంటాడు.

నిజమే. వ్యక్తిగత ఆశల్నీ, కోరికల్నీ త్యాగంచేసి పేదవారికోసం బయలుదేరడమేమంత సులభం కాదు. చాలా అపహాస్యాలూ – అవరోధాలూ ఎదురవుతాయి. తన శిష్యుడికి రాసినొక లేఖలో ఈ పరీక్షని తట్టుకోవడం చాలా ముఖ్యమని వివేకానందుడంటాడు. మనల్ని ఉక్కు మనుషులుగా, వజ్రసంకల్పులుగా మలిచే విద్యాలయం అదే.

> *అసంఖ్యాక ప్రజానీకం ఆకలితోనూ, అజ్ఞానంతోనూ ఉంటే, వారి కష్టార్జితంతో విద్యావంతులై వారినే లక్ష్యపెట్టని ప్రతి ఒక్కర్నీ దేశద్రోహనే అంటాన్నేను. ఆకలితో నకనకలాడుతున్న అనాథల్నీ, దీనస్థితిలోనున్న దిక్కులేని దౌర్భాగ్యుల్ని పట్టించుకోకుండా వార్ని పీల్చి సంపాయించిన ధనంతో ఆడంబరంగా జీవిస్తున్న వార్ని మించిన ద్రోహులు లేరు.*
>
> – *వాల్యూం-5, ఎపిస్టిల్స్-ఫస్ట్ సిరీస్, XXV, అలాసింగా అక్టోబర్, 1894.*

*"గెలిచేసే వారిపట్ల కల సానుభూతి కారణంగా నేనూ ఎగతాళి చేయబడ్డాను. అపనమ్మకంతో చూడబడ్డాను, అపహాస్యం కావించబడ్డాను. కానీ, వినండి, ఇదో వేదనాభరిత శిక్షణాలయం, సహానుభూతినీ - సహనశీలతనీ సాధించిపెట్టే అద్వితీయమయిన బోధకుల్నీ, సాధకుల్నీ మలిచిన విద్యాలయం, అన్నింటికంటే ప్రధానంగా ప్రపంచం మొత్తాన్నీ మీ పాదాల దగ్గర పెట్టే అజేయమయిన, అచంచల ఉక్కు సంకల్పపు దృఢవిశ్వాస దృక్పథమది[73]"* అంటాడు.

మనం కనుక అధైర్యపడకుండా నిలబడితే, అంతిమంగా ప్రజలు న్యాయమయిన పక్షం కచ్చితంగా వహించి తీరతారు.

*"ప్రతీ పనీ కూడా అవహేళన, అవరోధాలు చివరికి అంగీకరించబడటం మొదలయిన దశలు దాటాల్సిందే. తన కాలం కంటే ముందుగా ఆలోచించే ప్రతీవ్యక్తీ తప్పనిసరిగా అపార్థం చేసుకోబడతాడు"[74]* అంటాడాయన.

భారద్దేశ యువత సవాళ్ళను హుందాగా స్వీకరించి వేలాదిగా తనతో కలిసి చేతులు కలిపి కదుల్తారని బలంగా నమ్మాడు.

*"భారతదేశం తన ఉన్నతమయిన అత్యుత్తమ బిడ్డల్ని త్యాగం చేయాల్సిన అవసరముందని నాకు కచ్చితంగా తెలుసు... తెగించి కదనరంగంలోకురికే కొద్దిమంది యువతీయువకులే, వార్ని వారు దేశానికి సమర్పించు కుంటున్నారు. కానీ వాళ్ళు చాలాకొద్దిమంది మాత్రమే; మనకి అలాంటి వేలాదిమంది కావాలి, అంతమందీ వస్తారు"[75]* అంటాడు.

అన్ని విధాలయిన అసమానతల్నీ సమూలంగా నిర్మూలించడం కోసం, ఒక నూతన సమాజాన్ని సృష్టించడం కోసం, పేదల అభ్యున్నతి కోసం, జనబాహుళ్యాన్ని కదిలించి ఉద్యమింప జేయడం కోసం, దేశాభివృద్ధే లక్ష్యంగా త్యాగాలకై సిద్ధపడే యువతీ యువకుల్ని చైతన్యవంతులుగా మలచడం కోసం అవిశ్రాంతంగా నిత్యం జ్వలించిన ఒక గొప్ప సాహసోపేత గాథ వివేకానందుడి జీవితం. ఆయన విశ్వాసమెలాంటిదో చూడండి:

*"నన్ను నమ్మండి, మనం రాల్చిన ప్రతీ రక్తపుచుక్క నుండీ యావత్ ప్రపంచాన్నీ విప్లవీకరించే వెనుదీయని శూరత్వం కల వీరులుద్భవిస్తారు."[76]* ●

*మనం తప్పనిసరిగా మరణిస్తాం; అదేదో మంచి కోసం మరణిద్దాం... యావత్ ప్రపంచమూ ఒక్కటే. మీరందులో స్వల్పమయిన అల్పప్రాణులు... కాబట్టీ మిమ్మల్ని మీరు అధికంగా ఊహించుకోకుండా అసంఖ్యాక సహోదరులకి వీలైనంత సహాయపడండి.*

*- వాల్యూం-3, లెక్చర్స్ ఫ్రమ్ కొలంబో టూ అల్మోరా, సన్యాసా : యిట్స్ ఐడిల్ అండ్ ప్రాక్టీస్, 19 జూన్ 1899*

# REFERENCES

All references, unless otherwise mentioned, from : *Complete Works of Swami Vivekananda,* www.ramakrikshnavivekananda.info.


1. Dr. Dattaprasad Dabhokar, *Shodh Swami Vivekananddacha,* Manovikas Prakashan, Mumbai and Pune, 2010.
2. See endnote 41.
3. Volume 5 / Epistles – First Series / LXXVIII / Mary Hale, 9 July 1897
4. Volume 5/ Epistles – First Series / IV / Alasinga, 20 August 1893.
5. Ibid.
6. Volume 3 / Reports in American Newspapers / Miracles, 17 February 1894.
7. Volume 1 / Lectures and Discourses / Soul, God and Religion.
8. Volume 5 / Epistles – first Series / XXIII / Kidi, 30 November 1894.
9. Volume 8 / Notes of Class Talks and Lectures / Man and Maker of His Destiny.
10. Ibid.
11. Ibid.
12. Volume 3 / Lectures from Colombo to Almora / The Work Before Us.
13. Volume 9 / Letters – Fifth Series / LXXX / Editor of *Light of the East,* 1896.
14. Volume 8 / Epistles – Fourth Series / Ix / Haridas Viharidas Desai, 22 August 1892.
15. Volume 5 / Epistles – First Series / III / Alasinga, 10 July 1893.
16. Volume 6 / Epistles – Second Series / LXXI / Rakhal, 1895.
17. Volume 6 / Lectures and Discourses / The Methods and Purpose of Religion.
18. Swami Nikhilananda, "Early Years" in *Vivekananda A Biography.*
19. Volume 7 / Inspired Talks / Recorded by Miss S.E. Waldo, 24 June 1895.
20. Volume 4 / Writings : Prose / To My Brave Boys, 19 November 1894.
21. Volume 6 / Epistles – Second Series / XLI / ramakrishnananda, 19 March 1894.
22. Volume 6 / Epistles – Second Series / IX / Sir, 17 August 1889.
23. Volume 5 / Epistles – first Series / V / Alasinga, 2 November 1893.
24. Volume 5 / Epistles – First Series / VI / Haripada Mitra, 28 December 1893.
25. Volume / Epistles – First Series / III / Alasinga, etc., 10 July 1893.
26. Volume 4 / Writings : Prose / Arayans and Tamilians.
27. Volume 8 / Epistles – Fourth Series / XCVI / Sister Nivedita, 4 July 1897.
28. Volume 3 / Lectures from Colombo to Almora / The Mission of the Vedanta.
29. Swami Nikhilananda, "Vedanta in America" in *Vivekananda A Biography.*
30. Volume 5 / Epistles – First Series / VII / Madras Devotees, 24 January 1894.

31. Volume 5 / Epistles – First Series / VIII / Alasinga, 9 April 1894.
32. Volume 6 / Epistles – Second Series / LXXI / Swami Brahmananda, 1895.
33. Volume Volume 3 / Lectures from Colombo to Almora / The Mission of the Vedanta.
34. "Vivekananda the Revolutionary", http://americanvedantist.org.
35. Volume 1 / Lectures and Discourses / Soul, God and Religion.
36. Volume 4 / Addresses on Bhakti - Yoga / The Ishta.
37. Volume 2 / Jnana-Yoga / the Necessity of Religion.
38. Volume 4 / Lectures and Discourses / The Great Teachers of the World.
39. Volume 6 / epistles – Second Series / CXLII / Sarfaraz Hussain, 10 June 1898.
40. Volume 4 / Writings : Prose / To My Brave Boys, 19 November 1894.
41. Volume 6 / Epistles – Second Series / CXLII / Sarfaraz Hussiainm, 10 June 1898.
42. Volume 6 / Epistles – Second Series / XLI / Shashi, 19 March 1894.
43. Volume 5 / Epistles – First Series / II / Pandit Shankarlal, 20 September 1892.
44. Volume 8 / Epistles – Fourth Series / XXXIV / Haridas Viharidas Desai, November 1894.
45. Volume 1 / Lectures and Discourses / Soul, God and Religion.
46. Volume 2 / Practical Vedanta and Other Lectures / The Way to the realisation of a Universal Religion.
47. Ibid.
48. Volume 4 / writings : Prose / What We Believe in, 3 March 1894.
49. Volume 6 / Epistles – Second Series / CXXXVI / Swami Akhandananda, 10 October 1897.
50. Volume 2 / Practical Vedanta and Other Lectures / The Way to the realisation of a Universal Religion.
51. Volume 2 / Jnana-Yoga / The Necessity of Religion; Volume 3 / Lectures and discourses / Unity, the Goal of Religion.
52. Volume 6 / Epistles – Second Series / CXLII / Sarfaraz Hussain, 10 June 1898.
53. Volume 7 / Epistles – Third Series / XXXII / Alambazaar Math, 27 April 1896.
54. Volume 6 / Epistles – Second Series / LXXI / Swami Brahmananda, 1895.
55. Volume 7 / Epistles – Third Series / XXXII / Alambazar Math, 27 April 1896.
56. Volume 2 / Jnana-Yoga / The necessity of Religion.
57. Volume 4 / Writings : Prose / To My Brave Boys, 19 November 1894.
58. Volume 8 / Epistles – Fourth Series / XX / Haridas Viharidas Desai, 20 June 1894.
59. Volume 5 / Epistles – First first Series / XXV / Alasinga, 1894.
60. Volume 6 / Epistles – Second Series CXII / Mary Hale, 1 November 1896.

61. Volume 3 / Lecrtures from Colombo to Almora / Reply to the Address of Welcome at Paramakudi, 1 February 1897.
62. Volume 6/ Epistles – Second Series / CXII / Mary Hale, 1 November 1896.
63. Volume 4 / Translations : Prose / Our Present Social Problems, 23 Dec, 1898
64. Volume 6 / Epistles – Second Series / CXII / Mary Hale, 1 November 1896.
65. Volume 4 / Translations : Prose / Modern India *(Udbodhana, March 1899).*
66. Volume 7 / Conversations and Dialogues / From the Diary of a Disciple (Sharat Chandra Chakravarty): VII (Belur Math, 1898).
67. Volume 5 / Interviews / Indian Missionary's Mission to England.
68. Volume 1 / Lecrtures and Discourses / Reason and Religion.
69. Volume 7 / Translation of Writings / Memoirs of European Travel : I.
70. Ibid.
71. Volume 5 / Epistles – First Series / LII / Alasinga, 9 September 1895.
72. Volume 2 / Practical Vedanta and Other Lectures / Practical : Part IV
73. Volume 5 / Epistles – First Series / Letter to Alasinga, 20 August 1893.
74. Volume 5 / Epistles – First Series / XLVII / Maharaja of Khetri, 9 July 1895.
75. Volume 6 / Epistles – Second Series / LI / Dr. Nanjunda Rao, 30 November 1894.
76. Swami Nikhilananda, "In Northern India" in *Vivekananda A Biography.*

---

"On a group of theories one can found a school; but a group of values one can found a culture, a civilization, a new way of living together among men...

I do not conceive socialist policy as tied to any particular theory, but to a faith. The more socialist theories claim to be 'scientific', the more transitory they are, but socialist values are permanent."

– Ignazio Silone